శ్రీశివాయగురవే నమః

# విషయసూచిక.

---o---

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## కిష్కింధాకాండము.

---o---

## ప్రథమాశ్వాసము.

---o---



సంప్రసాదసంజ్ఞిక
భాసుర సౌహృదరసప్ర ♦ వాహనూమజ్జ
ద్ఘసహితవిమతనిజవర
శాసనముచితసామ్యలక్ష్మి ♦ తా! జగదీశా! ౧

తే॥ అవధరింపుము దేవ ది ♦ వ్యాంతరంగ
సీమ నాదు విజ్ఞాపన ♦ చిద్విలాన
మొలయు లలనావతంస మ ♦ క్కలన వేడ
వభవుఁ డిటు చిల్కె రామక ♦ థాఽమృతంబు. ౨

— ♦ శ్రీరాముఁడు తమ్మునితోఁ గూడి పంపాసరస్సున కేగుట ♦ —

ఉ॥ ఈసు దొఱంగి క్రోలనగు ♦ నీసుధ నాన సుధాఽవహాసివా
చానము పేయుషీ! విను వి ♦ శాంపతి యాశబరీ ధృతవ్రత
భాసురపుణ్యలోకచయ ♦ భాగినిఁ జేసి విలాసినీసము
ల్లాసితఁ గాంచె నంచితక ♦ లామయుఁ బంప నిలింపకాంక్షితా. ౩

ఉ॥ వాసవకాననోపచిత ♦ వైభవయోగ్యతటద్రువల్లరీ
శ్రీసముపేత నిర్మలిన ♦ శీతలరసస్వరసానపేత సం
వాసితదిక్కగంధవహ ♦ వల్లభలాలనసంప్రతీత ల
క్ష్మీస్మసకలార్థలక్షితని ♦ కేతనభూతియు నై సభాకృతిన్. ౪

క॥ చూపట్టెడు నద్దాని ని, రూపించుచుఁ జేరఁజని ప్రి ♦ యాథమనస్కా
రాపూరణోచితములు వి, పాపము లగు తజ్జలముల ♦ బడలిక దీర్చెన్. ౫

ఆ॥ స్నానపానవిధులు♦జరిపి తత్తీరమ్ము, మొనయు దారి ఋశ్య♦మూకమునకుఁ
బోవుచుండుతఱిని♦బొనర నిల్లనె రాముఁ, డనుజుతోడ హృద్య♦వార్త నెఱయ.

— ♦ శ్రీరాముని భావవిహారము ♦ —

ఉ॥ పొంపిరివోవు సంపదలఁ ♦ బొల్చెడు నియ్యది కంటె లక్ష్మణా!
పంప యటందు రీసరసి ♦ భాగ్యము కల్గినవారి సొమ్మ న
న్నంపల నేఁచు మన్మథుని ♦ యాయుధశాల యనంగఁ గానవై
యింపొనరించుచున్నయది ♦ యింపనిదయ్యెఁ దలంపు లుబ్బఁగన్. ౭

ఉ॥ ఊడిగము ల్పొనర్పఁ గమ ♦ లోత్పలపాళికి షట్పదాళు లే
నాఁడును గొల్వఁ బాయనివి ♦ నాఁ జను నంచలు జక్కవ ల్కవ
ల్వీడ వనంగు నూల్కొలుపు ♦ వెజ్జు మధుం డనిలార్భకుండు వోఁ
గూడని చుట్ట మిక్కొలను ♦ గూర్చిన పున్నె మదెట్టిదో కదా. ౮

సీ॥ ప్రొద్దుప్రొద్దునఁ దమ్మి ♦ పూవులసిరితోడి, వయి భృంగగీతమ్ము ♦ లతిశయిల్ల
మేల్కాంచి మెలఁకువ♦మెయికొనఁ గమ్మతె, మ్మెరలు సేవింప నె♦మ్మెలు దలిర్ప
బాలభానున కెదు ♦ ర్వడి ప్రీతి ఘటియించి, చక్రచక్రము నేలు ♦ జాడ నెఱపి
తటరుహాగమవృత్తిఁ ♦ బనరు ద్విజాతిథి, సత్కారమున కల్మిఁ ♦ జాల నెగడి

నిత్యసౌభాగ్య మనఁ దన ♦ నెలవె కాఁగ
మహితమానసలీల ని ♦ ర్మలిమ యగుచు
నీసరోజిని రసవహ ♦ యింపు గులుక
నామదిఁ గరంచుచున్న దీ ♦ నాఁట వత్స! ౯

ఉ॥ పువ్వులఁ బండ్లఁ గొంచుఁ దట ♦ భూజము లోజ మెలర్ప దీనికిం
ద వ్వనరాని చుట్టలయి ♦ తాల్కొని ఛాయ లొసంగి పాంథులన్
మవ్వ మెసంగఁ దేర్చు జన ♦ మానిత మిత్రల మిట్టిచోట నా
జవ్వనితోడ నున్నయెడ ♦ స్వర్గ మయోధ్య స్మరింతునే మదిన్. ౧౦

తే॥ నిత్యకల్యాణి యీనేల ♦ నేఁడె యనఁగ, నేల మైన విజృంభించె ♦ నిపుడు మధుఁడు
దేశకాలమ్ము లొకఁడైన ♦ తీ రెఱింగి, మందుచున్నాడు వహ్నికి ♦ మాఱు మరుఁడు.

మ॥ చివురుల్ కోయిలబంట్లకున్ శకవాయు ♦ శ్రేణు ల్భుజింపంగఁ దీ
వవు పండ్లు న్మధుపానుజీవులకు దీ ♦ వ్యత్పూనగుచ్ఛంబులున్
వివరం బొప్పఁగఁ గూర్చి శాతస్వరము ♦ ల్వ్యాఖ్యాతము ల్తద్విశే
షవిధిం దాల్చెడు వీఁ డలంతిరొ మరు ♦ న్సామ్రాజ్య మేలించుచోన్. ౧౨

తే॥ తేనె పూసిన కత్తి యు ♦ క్తిపకుండు, మాధవుం డనఁ జనునె యి ♦ మ్మారసఖుని
విప్రయోగినిపీడన ♦ విధిని నీత, డస్త్రశస్త్రప్రమోషితత్వమ్ము ♦ నందకున్నె. ౧౩

తే॥ శ్వసను ప్రేరణ నిమ్మహా ♦ సరసిలోని
యలలు దోతెంచు నని వేడ్క ♦ కరయరాదు
వరుణపాశంబు లవి వాని ♦ వరుసఁ బోడరు
నబ్జములు కామసంమోహ ♦ నాశుగములు. ౧౪

ఆ॥ పుష్పవృష్టిఁ గురియుఁ ♦ బొలుపందు లతలతో, వృక్షరాజి పేరి ♦ పక్షమొనసి
రాజుతోడివారు ♦ రా సమృద్ధు లొనర్తు, రిట్టి పనులు నైజ ♦ మెంచఁబోరు. ౧౫

క॥ చేయు మని చేయ సంతస, మాయె ననం గలదె దర్ప ♦ మా యది వలపా
నాయాయుష్యము నాసిరి, పాయక యుండఁజను నొడ్ల ♦ పాల్లైటులైనన్. ౧౬

ఉ॥ కొండల యండదండ నెల ♦ కొన్నది యీసరసీస్రవంతి యీ
కొండలఁ బోని మ్రాఁకు లటు ♦ కోటినకాఁపులు దీని కివ్వసం
తుం డనిలుండు శిల్పమునఁ ♦ దోడ్పడ నూరుఁడు రాజు మెచ్చ ను
ద్దండత మారకర్మములఁ ♦ దార్కొనుఁ బద్మవికాసహాసమై. ౧౭

తే॥ తనరు నాపాతరమణీయ ♦ తరము లగుచుఁ
దలము లొకకొన్ని యంతయుఁ ♦ దలఁప విషమె
యతిథిపూజ లొనర్తు ర ♦ య్యసురు లిరువు
రాదట వధింతు రను వార్త ♦ యరయ లేదె. ౧౮

తే॥ అనిలుఁ డాడించుచున్నవాఁ ♦ డవనిజముల
నేలఁ బూజించు నవి పూల ♦ నిష్క్రియముగ
మహిజఁ బాయుట నన్నియు ♦ మలఁగి నేఁడు
శత్రుకోటిని శెరసె ని ♦ స్సంశయముగ. ౧౯

క॥ మ్రాఁకుల కొనకొమ్మలకుం, బ్రాఁకిడి తల లెత్తి లతలు ♦ ప్రకటశ్రీలై
నాకష్టదశకు నగుచు వి, లోకించెడు తెఱఁగె యింత ♦ లోఁ గననయ్యెన్. ౨౦

తే॥ కొన్ని మాధ్యమికుల నుండంగఁ ♦ గొన్ని వ్రాలఁ
గొన్ని యంతరాంతరములఁ ♦ గొమరుమిగులఁ
జేటికల నవ్వానిఁ ♦ దేంట్లు పొదువ
నాట లాడెడుఁ బూలతో ♦ ననిలుఁ డిపుడు. ౨౧

మత్తకోకిలము॥ మత్తకోకిలరావము ల్సగ ♦ మారుతాఖ్యనటుండు భూ
భృత్తటీవనకీచకస్వన ♦ భృంగగీతు లెసంగ సం
పత్తి సంనహనం బెలర్పఁగ ♦ సాఘనర్తకవృత్తి పే
రుత్తు లాడఁ బొనర్చి కూర్చెడు ♦ రూపకీయనిరూపణల్. ౨౨

తే॥ పూలపాగాలు తనరంగఁ ♦ బొలుచు తలలు
ద్రిప్పుచు ద్విరేఫగీతి సం ♦ ప్రీతిఁ జెలియఁ
జేయుచున్నవి తరువులు ♦ వాయుయుక్తిఁ
దమ తెలివి వింతనే వను ♦ ధాతలమున. ౨౩

ఆ॥ ఎట్టి జతన మొంచె ♦ నీవసంతుఁ డనంగుఁ, డెట్లు వేఁపఁ దొడరె ♦ నింత యెఱిఁగి
యట్లు హృష్టపుష్ట ♦ మైన యీకోయిల, నన్నుఁ బిలిచి తెగడు ♦ చున్న దిపుడు.

క॥ చందనశిశిరతఁ బువ్వుల, యందలిపొడిఁ గొంచు మందుఁ ♦ డౌ ననిలుఁడు రా
ముందటిచందము మార్పడఁ, దుందుడుకుతనమ్ము నూపఁ ♦ దొడరెడుఁ గంటే.

సీ॥ శిఖ యాడు నెఱి నాడు ♦ శిఖిని తెక్కలు విప్పి, కదిసి నన్నేలు కే ♦ కలు సెలంగ
నళినితో నళి మధు ♦ వాని పాటలు పాడి, యూరించు నామది ♦ యుక్కసెడఁగ
నిగురులు గొఱికి కో ♦ యిల ప్రియ కందించి, కను లెఱ్ఱపడఁగ న ♦ న్నాంచి గదుము
శుకికిఁ బండుల పేన ♦ మొకటఁ బెట్టుచు శుకం, బూగించు నన్నుఁ జూచి ♦ యుత్తమాంగ

తే॥ మిన్నిటికి మూల మామని ♦ యే యటంచు
నెఱిఁగి యెఱిఁగియుఁ జేయంగ ♦ నేమి గలదు
నామనోహర యొక్కెడ ♦ నవయుచుండ
నా గ్లానవర్చెడు కొలల కే ♦ నొదిఁగియుంటి. ౨౬

వ॥ సౌమిత్రీ! మైత్రి పాటించి మధుమాససమయం బనక యనాలోచితంబుగా నీ పంపాసరోవరవనోద్దేశంబునం జొరఁబాఱితిమి మొక్కలం బగు నిక్కాలంబున నిక్కాలనునయుండున గొజ్జంగివన్నిటి తేటదనంబున మాటకు బాటన నగుబాటు గూర్ప నోపు తియ్యని క్రియ్యాట మాటుపఱుపంజాలి యిట్టలంబుగ మిట్టలపై నుండి దిగజాఱి యంశుమంతుని కిరణస్ఫురణంబులలోని క్రొత్తతళ త్తళలు సంగ్రహించి యాణిముత్తియంపుఁ గోవలు పెట్టి పెంద్రోవ నిద్దాని కలంకారంబు

గూర్చిన తెఱంగుదోఁపం బ్రియాతస్థలంబుల కవతరించు సెలయేళ్ల వారిధారల
వలనను సహస్రకరస్పర్శనంబున నెమ్మేను లుప్పొంగ నొప్పారు పులకజాతంబు
లకు సహజాతంబు లగుచు సరోజినుల వదనకమలంబులం గనుపట్టిన దట్టంపు
వికాసపరిమళంబులకు నీడుజోడు లన వెనువెంటన యుద్భవిల్లి రంగారం బొంగా
రిన యుత్తమోత్తమాధరామృతరసధారలవలనను నొయ్యారంబునం బొదలు
సయ్యాటంబుల వాటంబు లగు నాటపాటలతోడి నెయ్యంబునం దోఁతెంచు
మలయపవనుని మేలి శిక్షం బ్లవమానంబు లగుచుఁ బావమానస్వస్త్యయనాను
వాకంబు లధ్యయనం బొనరించు ద్విజసమాదృతవసంతశాఖినికురుంబంబుల డంబగు
కలాభ్యసనంబున వికసనంబు లపేక్షించి యౌత్సుక్యంబునం బొంచి యాలించు
చున్న వాసంతికాప్రముఖవల్లికామతల్లికల లతాంతగుళుచ్ఛంబుల నుబ్బి గుబ్బ
తిల్లు నమందమరందనిష్యందంబుల పేరం గొనితెచ్చి సమీరకిశోరంబులు సమ
ర్పించు నుపహారసంభారంబులవలనను పుటపుటలై పెనుపాకు తీయనన మిన్నుముట్టి
యచ్చోటునన వన్నెకెక్కిన వేలుపుల కొలను నేనిఁ దోఁపాడి మేలమాడుదుం
జూడుం డని రాజహంసకాదంబకకదంబం లశబ్దవిశేషంబులం జెలువుచుఁ బ్రోదిని
యనం బొనరుపడి యొప్పు మీఁకు దుమారంబుల నుప్పతిల్లి యొప్పులకుప్పలై
మగఱాల తిప్ప లనసై కప్పుకొనిన యప్పుల రాయిడి యనెడు పెనుముప్పునం
బొలివోక యాఁకపడి నిలువంబడిన మేని పుష్పాదుల సముచ్ఛ్రితంబు లగు
ద్వీపంబుల ద్వీపవతియై యపారజలసారపూరప్రసారంబున స్రోతోవహ యై
యుద్దామతరంగరింగణంబులఁ దరంగిణి యై ప్రసూనఫలభార నమ్రవివిధ
తరులతాకుంజపుంజ శీతలచ్ఛాయానపేత శశికాంత శిలామయతటశోభి
త్వంబునఁ దటిని యై గారుత్మతరత్నసోపాననిచయసచ్ఛాయ యై వలవిశేషసమా
సక్తి కలిమి శైవలిని యై యతిశయిల్లి యిప్పర్వంబునం బరిసరవర్తిపరికరసంపత్తి
నిప్పద్మ రాజధాని యప్పద్మకుమారుని జగదేకసామ్రాజ్యపట్టభద్రుం గావింప
నెంచు నక్కార్యంబునకు మొనకొను రాజబంధువర్గంబునకు మునుమున్న యవని
కుమారికాసుకుమారావయవంబులం బోని కుసుమగుచ్ఛంబులం దాల్చి యందం
బలరార నందందు శోభిల్లు మాధవీలతాంగనలకు సౌవర్ణవర్ణప్రసూనాభర
ణంబులు సమర్పించు కర్ణికారంబులతోడి యైకమత్యంబునం బద్మరాగంబు
లందిచ్చు పలాశపలాశితతుల చెంత సుమనశ్శేఖరము లనువొంద నలువొంద
మాకందసందోహంబులకన్న మిన్నలై విరిపాగాలు పెట్టిన తల లెత్తి చద
లొరయు తిలకవకుళకురంటకప్రముఖమధువృక్షతిలకంబుల ముకులంబుల వెంట
నవికలంబులుగాఁ దిరుగు మధుకరమాగధుల గీతివిశేషంబులు జనకనందినీనవనవో
న్మిషన్మధురగీతివిశేషంబులై వినుపడ నదనునం బదనున నెక్కిన పరభృతికాస్వరం

బక్కటకొలకొంకంఠి కంఠస్వరంబు స్మరణంబుఁ బొనరింప శుకశారికల కలరవోచితంబు లగు సప్పలుకులు కంతుని ములుకులకు లక్ష్యంబు సూపుచు నయ్యకలంకచంద్ర వదన సూక్తోక్తుల కనుమాపకంబులు గా నోపఁ బ్రతిక్షణంబును నిర్దాక్షిణ్యత్వంబునం బ్రవర్తిల్లు దక్షిణదిశాగంధవహుని గంధవత్ప్రచారంబు లాశుభాచార నిశ్వాసపవనాంకురమ్ముల యనుపమసంపదల నువలాలింప నింపున నిలింపులనేని నలరుటంపల ముంప నడరు గుంపులమారి మారుని యిన్నాటిసన్నాహంబున గ్రచ్చికొను కార్చిచ్చు నడిచక్కిం జిక్కువడిన హరిణం బనంగ నైతిఁ దమ్ముఁడా! యీయమ్మలికమ్మునకుం బారమ్ము గలదే యనుచు నప్రాకృత వైభవుం డయ్యుం బ్రాకృతుని విధంబునం బనివెడుభ్రాంతిం గని సౌభాత్రంబు పెనుపొంద సుమిత్రానందనుండు శ్రీరామా! జయరామా! కల్యాణనామా! పరంధామా! నామనవిని నేమఱక చేకొనం బ్రార్థించెద. నరిదళంబుల నున్మూలించుటకును నాశ్రితవర్గంబులం బాలించుటకును నర్థిజనదారిద్ర్యధ్వంసనంబున కలిమి నమరవరవనవాటీశాఖిశాఖం బోలం బోలి త్రిలోకరాజ్యలక్ష్మీ పరిగ్రహణ ప్రశస్తం బగు నీదు దక్షిణహస్తంబు స్ఫురించుచుండ నింతలు పడ నీకొంట్లకుం జనునే పురుషోత్తమా! యాగంతుకం బగు వియోగదుఃఖం బుపసంహరింపుము. సహజధైర్య మవలంబింపు మతిస్నేహపరిష్వంగంబున సార్ద్ర యైన వర్తియు నగ్నిచే దహింపఁబడున కాదే. పుడమినయేని నాకసంబుననేనిఁ ద్రివిష్టపంబుననేని బుడమికన్నియఁ నాచి యుంచె నేనియుఁ ద్వత్ప్రసాదంబునం బడసిన శస్త్రాస్త్రవిశేషంబుల నద్దానవకులపాంసనుని బడలుపఱిచి దాసునిం జేసి న్యాసద్రవ్యం బట్టు లాసాధ్వీమణి నర్పణం బొనర్ప భవత్సన్నిధానంబునకుం దోడి తెచ్చెద. నష్టార్థం బుత్సాహంబునన కాని సమృద్ధిం బడయనేరఁడు గదా. నీదు మహనీయం బగు దివ్యానుభావంబు సంభావింపు మేకొఱంతయు మేకొనంబోవ దన వుడు వేషధారి వింతవేషభాషణంబుల నట్టులు శోకమోహంబులం బరిత్యజించి రామచంద్రుం డభిరామదర్శనుం డై తోడుతోడం దోడుతోడన ఋశ్యమూక గిరిం దరియవచ్చు నవసరంబున. ౨౭

—♦ శ్రీరామలక్ష్మణుల రాకకుఁ జలించి సుగ్రీవుఁడు పాఱిపోవుట. ♦—

క॥ ఆతని మది మెలఁగుచు స, ర్వాతీతవికాసభాసి ♦ యగు లక్ష్మణుఁ డ
మ్మాత నెల వరయుజతఁ ద, దాతంక మెడల్చుచుండె ♦ ననలసుఁ డగుచుక్.

సీ॥ త్రిజగజ్జయశ్రీలఁ ♦ దివియఁజాలిన మేల్మి, కరముల విం డ్లమ్ము ♦ లురవడింప
నవ్యోన్నతులందుండి ♦ నెరయు దీధితు లున్న, భాను చుట్టఱికమ్ముఁ ♦ బ్రస్తుతింప

నిరురూపు లిట్టె దన♦క్కి ట్లంచు విధి నేర్చె, వెనుకటిమరుసిరి ♦ వెల్లడింప
లావణ్యవీచీల♦లచ్చందర్రియుగ్మంబు, జనదృక్చకోరాళి♦సంతరింప
నొలయు తాపసవేషమ్ము ♦ లొలఁపు మాఱు
పలుప నెంచిన నెఱికి లోఁ ♦ బడక కడల
కడచెదు ప్రభావములుమింత ♦ లై తలిర్పఁ
జెరయు నరకేసరులఁ గాంచె ♦ హరివిభుండు. ౨౯

క॥ కని తోడివారిఁ గని యు, య్యనజుఁడు వాలి వనుపంగ♦నే తెంచెద రీ
ఘనసత్త్వులు మాకేవ్సం, బను నివ్వురున డాగి నెఱయు♦వగ్గలు వోలెన్. ౩౦

మ॥ అని శంకింపుచుఁ బల్క వారు విని య ♦ ట్లానే మొ యూఁచుం దలం
చి నగాగ్రంబుల శైలశృంగముల ల ♦ క్షీభూతులుం గాక రా
క నిజం బారయఁ గోరి ప్రాఁకిడిరి పేఁ ♦ క నాళ్లు రాల న్లతా
వనిజాతంబులు పీ్రల సత్త్వములు ని ♦ ల్వంబోలమిం దూలఁగన్. ౩౧

క॥ కొండొకతడవున కందఱు, నొండెడకుం జేరి యొడయఁ♦డురుసత్త్వం డ
ట్లుండ సెడి యుండ నాతని, దండ న్నిలఁబడి విధేయ♦తావశులగుచున్. ౩౨

తే॥ పరిపరివిధంబులం దల♦పట్లు పట్టి, కొను నెడఁ బరావరవిభ క్తి♦కోవిదుండు
మంత్రివర్యుండు నౌ హనూ♦మంతుఁ డతనిఁ, జేరి యిట్లనె నిజవచ♦శ్శ్రీ రహింప.

—♦ హనుమంతుఁడు సుగ్రీవునితో సంభాషించుట. ♦—

ఆ॥ నీతికోవిదుఁడవు♦నెఱిగల్లువాఁడవు, ధైర్యసాహసములఁ♦దక్కువడవు
నీవె యిట్టు లైన♦నేత యొండొకఁ డేమి, సన్నఁ గృతినిఁ జాలుఁ♦జక్కఁబఱుప.

క॥ ఎదిరిజనము స్వీయం బని, యొదవదు కద మదికి వివర♦మోహో యొడ ని
ట్లుదిలపడి పఱవ నే మగు, నది కడపటి తెఱవు దాని♦కడ్డొకఁ డున్నే. ౩౪

ఆ॥ ఒండు వనువ వచ్చి ♦ నొక కీ డరసి యంటి
వట్టు లైన నట్టె ♦ డైన జనము
తపసివేసములవ ♦ తారొ్కంచు శరశరా
సనవిశేషకలనఁ ♦ బొనరువడునె. ౩౬

చ॥ అరి కిటఁ జేర రాద కద ♦ యాతఁడు వంప నలంపవచ్చు వా
రరయరె యిట్లు పైకొన న ♦ యం బని యొక్కఁడు లేదె యాఘనుల్
సురుచిరమూర్తు లేవనికిఁ ♦ జొచ్చిరొ యిత్తల ముత్తలంబునన్
జరుగఁగ నేల యేమివిధి ♦ నంగడ మవ్విధికూర్పు నొందెనో. ౩౭

క॥ ఎవ్వఁ డపకారి దుష్టుం, డవ్వాలియుఁ దోషుతోడ ♦ నరు దేరఁడ నీ
కివ్వనట మేల పొడమెను, బువ్వాఁ జూచెదె సమృద్ధి ♦ బుద్ధిఁ జళుకునన్. ౩౮

ఆ॥ పురుషకార మలఁతి ♦ వోవ నీ విల్లైన
నరియు నతనివారు ♦ నంత లింత
లనరె మొక్కతెఱఁగు ♦ నన యున్న కాలమ్ము
దైవమున విభక్తిఁ ♦ దలపవలదె. ౩౯

ఆ॥ పెద్దతికముఁ గంటె ♦ పెనఁకువ లొప్పితి, పాలనమున తెఱఁగుఁ ♦ బా టరసితి
విట్టి నిన్నుఁ బోటె ♦ నింతలు చేసిన, యది ప్లవంగమత్వ ♦ మనఁగ రాదె. ౪౦

క॥ దారితల నెరయురీతి యు, దారాకృతికలన సముది ♦ తత్త్వము నెఱయన్
దా రుచితగతికిఁ దలఁగని, వా రను వల నెఱుక నేయ ♦ వచ్చెద రనఘా! ౪౧

ఆ॥ సుప్రసన్నభావ ♦ సూచన ల్మాహాత్మ్య, మున తెఱంగుతోడ ♦ మొనయు దేర
వరసి కనుము వీరి ♦ యాంతర మెడఁబాటు, తెప్పలు వాపి బుద్ధి ♦ దిటవుపఱచి. ౪౨

క॥ అని పలుకు హనుమ పలుకులు, ఘనశోభనమంత్రరాజ ♦ కలితాక్షర మో
గనిరూఢిఁ దనర రవిజుఁడు, తన నెమ్మదిఁ జేర్చి తగవు ♦ తగ ని ట్లనియెన్. ౪౩

— ♦ సుగ్రీవుఁడు రామలక్ష్మణుల యొద్దకు హనుమ నంపుట. ♦ —

ఉ॥ రాజులు దూరదర్శు లవ ♦ రక్షల రంధ్రి మెఱింగి కూల్తు రే
యోజను వారి నమ్మి మను ♦ టొప్పదు గూఢచరు ల్మహాబలు
ల్నాఁ జను మిత్రు లద్దొరల ♦ లావున లా వెనయింప నొడ్ల ని
ర్వ్యాజాల నొంప నౌ సమయ ♦ మారయ వృత్తిన చేరి యుండఁగన్. ౪౪

ఆ॥ లోన మొనళు లుండ ♦ లు ప్తకాలువ్య వహా, నరనుమాడ్కిఁ దాఁ బ్ర♦సన్న మయ్యుఁ
జొచ్చువారి మ్రింగఁ ♦ జూచుచునే యుండు, రాజకమ్ము నమ్మ ♦ రాని దెపుడు. ౪౫

క॥ వాలి దవజ్వాలి యకద, కాలక యే కాలు నన్నుఁ ♦ గని కానకయున్
గీ లెఱిఁగి నేను మెలఁగెద, నీలో నిటరాక యతని ♦ కేరవై యుంటన్. ౪౬

ఉ॥ కాన సుదీర్ణవిక్రములు ♦ కార్ముకయుక్తులు దీర్ఘబాహు ల
స్థాన ఘటించు నెంచక న ♦ సంభ్రము లై పఱతెంచుచున్న వా
రినెఱివారి నొడ్ల నిటు ♦ లెన్నఁడుఁ గాంచియెఱుంగ కుంట మ
న్మానసవృత్తి చంచలత ♦ మై రిపువక్తము శంక నొందెడిన్. ౪౭

ఉ॥ ప్రాకృతిరూపముం గొని పి ♦ పాపము వర్తన మొప్ప వారిన
ప్రాకృతిమూర్తుల న్దొరసి ♦ ప్రొఁపునఁ బొప్పఁపున రాక పేఁక నొం
దేకలుషమ్ము లేమిఁ గని ♦ యింతియు సన్న పౌనర్వఁ జూడు మ
వ్యాకులభావము న్బొరసి ♦ యాదటఁ గర్దము తీ రెఱింగెదరా. ౪౮

ఆ॥ అనిన వల్లె యనుచు ♦ ననుచు కౌతుకమున
హనుమ భిక్షురూప ♦ మవధరించి
కార్యసిద్ధి మొనయఁ ♦ గావచ్చె నేమొకో
యి ట్లటంచు వార ♦ లెంచఁ గడిసి. ౪౯

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణులం జేరి భాషించుట. ♦—

క॥ కేలుమ్డోయి వినీతి, న్ఫాలతలంబునకుఁ జార్చి ♦ ప్రభుమర్యాదల్
జాలుగ నెరపి మృదువచో. లీల సుధాగుణనికాల ♦ లిరిమిగఁ బలికెన్. ౫౦

ఆ॥ ఇంతగా ఫలించె♦నేనాఁటి సుకృతంబొ, యన్నలార! నాదు♦కన్నుదోయి
కొదవె మేలిపండు♦వొరుల కలభ్యమై, తినసి యుష్మదీయ♦దర్శనమున. ౫౧

సీ॥ అత్తకాములకె కా♦కలసునే సంపద్మ, దనకలాద్యోతి మం♦దస్మితంబు
సత్యసంకల్పనం♦శ్రియు ఁకే కాక యి ట్లొప్పునే నియమల♦క్ష్యోల్లసనము
స్వకజనాథయదాతె♦లకె కాక పొసఁగునే, కారుణ్యరస మెఱుక్కు♦కన్నుదోయి
సకలశాసనరమా♦స్పదులకే కాక తాఁ, బరఁగునే విక్రమ♦స్ఫురితవృత్తి
లలిత కల్యాణగుణగణ ♦ లాలితులకె
కాక సౌభాగ్యలక్ష్మిని ♦ కానయోగ
మమరునే జన్మసాఫల్య ♦ మందఁగాంచి
కాక కంటినె భవదంఘ్రి ♦ కంజవనము. ౫౨

తే॥ దుర్గమస్థలసంచార♦దూషణమున, కేమి యపరాధ మొనరించె♦నీపదాబ్జ
యుగ్మముల్ము మేల్మి సౌందర్య♦యోగమునన, కాక దండనవిధిని నై♦క్యంబె కలుగ

తే॥ వచ్చినంతన కొల నిది ♦ శుద్ధగంగ
యయ్యె నిమ్మోలిచూడ్కుల ♦ నమరవనము
మార్కులైనవి తీరద్రు ♦ మములు మీఁద
నేది యేసిరిఁ గాంచునో ♦ యెఱుకపడదు. ౫౪

ఆ॥ ఎదిరియగ్గిరీంద్ర♦మీాతెనుద్యుతులచే, రత్నసానువై క ♦ రమ్ము మెఱసె
మదను ముదము నెనుచు♦మాటకుఁ బోలదే, సింహసంహననము ♦ శ్రీభవనము.

చ॥ సిరి తనయింటిదే యనెడు ♦ చెల్వము జెల్వగ సింహవిక్రమం
బనసము పేర్మియుం బెరసి ♦ యాకృతు లొందినచంద మైన మీ
రిర వెడఁబాసి చేష్టలుచు ♦ నేకత మేకతనం జొరంగనై
శిరొ తనువల్కలము ల్మునుల ♦ తీరునఁ గట్టి వనాంతభూములన్. ౫౬

ఆ॥ రాజభోగముల వి ♦ రాజమానులై కాక
కాలినడకతోన ♦ కదలివచ్చి
యేల యడుగఁజేయ ♦ ని ట్లూర్పువుచ్చుచు
మమ్ముఁబోటి ప్రజల ♦ మానసముల. ౫౭

సీ॥ ధరణీతలం బిది♦ధన్య మయ్యెను భవ, చ్చరణముద్రాన్వితో♦జాల నొగడి
యానరనారాయ♦ణాఖ్యులే యన మున్న, బాదరక్షేత్రమ్ము♦పావనమ్ము
మునివేసములపైని♦ముచ్చటగా గొంట, నెల్లలోకంబుల♦నేలలేరొ
రూపయౌవనకలా♦రూఢిఁ బెంపొందు ని, య్యనవున నిల్లాట♦యరయఁబడదు
రోజుచున్నవి యిష్టాని ♦ రుద్ధమార్గ
ములు శరశరాసనాసులు♦ముక్తకంచు
కమ్ము లౌ పన్నగము లట్లు ♦ గాట్ల కెదుర
నున్నవాఁ డెవ్వఁ డొక్కఁ డీ ♦ యుర్వియందు. ౫౮

తే॥ కన్నుఁగవ కన్న భాగ్యంబె ♦ కారణముగ
వినత యాశ్చర్యశ్రుతి యున్నది ♦ వివశ యగుచు
నీరసంబునఁ బోనీక ♦ యింతె దెలిపి
వినుతఁ జేయుఁ డక్కటికమ్ము ♦ విశ్రుతముగ. ౫౯

ఆ॥ కలసి మెలసి యింత♦గాఁ బల్కరించిన, నుత్తరం బొసంగ♦కుండి రనఁగఁ
బోల దాదరమునఁ బ్రోచువా రని దర, స్మితముతోఁ బ్రసాద♦సృష్టి దెలుప.

తే॥ ఏను సుగ్రీవసచివుండ♦వానరుండ, ననిలుని ప్రసక్తి నంజన♦యందుఁ బొడమి
నాడ హనుమంతుఁ డందురు♦నను వరాత్త, కామగతిరూపకలనలు♦గలుగువాఁడ.

ఉ॥ మోసము గాదు మీవలని ♦ మోహనరూపవిలాసనంపదల్
భాసురశౌర్యధుర్యతయు ♦ భావన నేసి ప్రభావయోగల
శ్శ్రీమనమేతులం చతఁడు ♦ కృత్యవిదుం డనుపంగ దర్శనా
భ్యాసవశంబునం దలఁపు ♦ లారసి సఖ్యముఁ గూర్ప వచ్చితిన్. ౬౦

క॥ మజనప్రియుఁ డాతఁడు స, త్త్వజవోపేతుండు సూనృ ♦ తవ్రతుఁడు స
ర్వజనీనచరితుఁ డనఁ దన, నిజ మరసిన నొసఁగుఁ జనవు ♦ నేస్తం బొడలున్.

ఆ॥ ఆతఁ డన్నవలని ♦ యపకారమునఁ జేసి, నెలవు వీడి యిచట ♦ నిలిచియుంట
కారణముగ శంక ♦ గదుర న న్నేఁ డంగ, భిక్షురూప మెనసి ♦ పెరసినాఁడ. ౬౪

క॥ నెనరు గల దొరలు తమభా, వనయే యింకిటఁ బ్రమాణ ♦ వస్తు వనుచు న
య్యనుపమమతిగీష్పతి యి, ట్లని యూరక నిలిచెఁ జిన్మ ♦ యాత్మవికాసా! ౬౫

—♦శ్రీరాముఁడు హనుమనిపలుకుల విని లక్ష్మణునకు నచ్చెరువడుచుఁ దెలుపుట.♦—

తే॥ తనమనం బుల్లసనమునఁ ♦ దనరుచుండ
హనుమ నుడు లట్లు విని రాముఁ ♦ డాక్షణంబ
మ్రోల నెలకొన్న లక్ష్మణు ♦ మురువు గాంచి
పలికె నమ్మేయి గంభీర ♦ భాషణముల. ౬౬

మ॥ కనఁ గాంక్షించిన లక్ష్మి తా నెదుర నై ♦ కన్పట్టె నన్నట్టు ల
య్యినసంభూతుఁడె పంపఁ దత్సచివుఁ డై ♦ శ్లైతేరఁగాఁ గ్రాలె ని
య్యనఘు న్దైవనిభు న్సుధామధురవా ♦ క్యస్నిగ్ధసంభావన
ల్పావరం దృప్తునిఁ జేయు మీతని కృతి ♦ న్బోల్పార మే లెంతయున్. ౬౭

తే॥ పొనర ఋగ్వేదమున శిక్షఁ ♦ బొలువుగాంచి
యాయజుర్వేదమున ధృతి ♦ నవధరించి
సామవేదవిదగ్ధ్యరీతిఁ ♦ జాల నెగడి
కాక యితని నెనయఁ బల్కఁ ♦ గలరె యొరులు. ౬౮

సీ॥ ఏనాఁడు చదివినో ♦ యిన్ని వ్యాకరణమ్ము, లపశబ్ద మని నుడు ♦ లందుఁ జొరదు
త్వరితమ్ము నానుడు ♦ తనము సందిగ్ధత, విస్తర మనరాదు ♦ వెదకి కనిన
కల్యాణి సంస్కార ♦ కలిత వాగ్దేవియే, యాడింపజాలె ని ♦ ట్లనఁగవలయు
నక్షరమ్ములు తావు ♦ లంది వ్యంజనలతో. మధ్యమస్వరమున ♦ మానితములు

గాఁ బలుకు వీనిపై వైరి ♦ కత్తి యెత్తి
యేని మఱలఁడె తనబుద్ధి ♦ నీనడించు
కొనుచు నవయవముల స్పృష్టి ♦ యనఘ! యీతఁ
డెవరి చిత్తవృత్తుల హరి ♦ యింపలేఁడు. ౬౯

క॥ ఇతనిం బోలిన సచివుఁడు, పతి కబ్బిన నట్టి దొసఁగు ♦ పాల్పడునే నీ
గతి సెడనీయక తనఁ దన, మతిబలమున నొడ్డు సేర్చి ♦ మనుపక యున్నే. ౭౦

ఆ॥ దూతకృత్య మెనసి ♦ దొరసిన యిమ్మేటి, పలుకుకతన నేను ♦ పాయఁగంటి
ముంచి తేల్చు శోక ♦ మోహోర్మికలఁ గార్య, కలనఁ గాని దొందు ♦ గలదె యింక.

క॥ సిద్ధిం బడయఁగ నగు నీ, సిద్ధార్థని తెలివి బలిమిఁ ♦ జేసి యన మనం
బద్ధము గావేరకు నీ, బుద్ధి నితని పొందు కలిమి ♦ బొలప మరయుమిా. ౭౨

తే॥ అనిన రామిత్రి హనుమతో ♦ ననియె నిట్టు
లన్న! నీ వేది తెలిపితి ♦ వదియ సేయ
నున్నవారము సుగ్రీవు ♦ నోజ మెఱుకఁ
గన్నవారము కనుడి ♦ కలిమి వెలయ. ౭౩

క॥ ఏ మతనిన కవి నెయ్యాం, బామెయిఁ గాని సేమ మొనయ♦నరుదెంచితి ము
స్వామగుణుఁడ వగు నీనుడి, మామది సందియము లెల్ల♦మలఁగె సహృదయా!

ఆ॥ అనిన సంతసిల్లి♦యాకృతి యే సిద్ధి, దలఁచి వచ్చినాడఁ♦దదభిలషిత
మదియ యమ్యో నేన♦యన నేల యన్నిఁట, ధన్యుఁ డయ్యె నింకఁ♦దపనసుతుఁడు.

క॥ ఇమ్మెయి నాలో నెంచుచు, ని మ్మొఱిఁగినవాఁడు హనుమ♦యినకులతిలకుఁ
నెమ్మిఁ బలుకుచుఁ దా నసె, సమ్మతి సంభ్రమము లేక♦సరణిఁ దలిర్పన్.

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణుల వృత్తాంతము తెలుపఁగ వేఁడుట. ♦—

ఆ॥ అయ్య! పంపాతటి♦లతిఘోరవిపినమ్ము, లందు మెలఁగఁ గాంచ♦నైన కార
ణం బదేమొ తెలుపు♦మింబు లౌ మేనులు, కఱకుఱాల ముండ్లఁ♦గాసిపడఁగ. ౭౭

క॥ ఒకయెడ నుండియె మహిమను, సకలము జగ మేలఁ జాలు♦సామివి మాని
ప్రకృతిక వేషకలనఁ ద, మ్ముకుట్టితో రాఁగ నేమి♦మొనసెనొ చెపుమా. ౭౮

క॥ అన విని రాముఁడు లక్ష్మణుఁ, గని శ్రుతి మొనరింపు మయ్య♦కర్జము తెలుఁగీ
వన నాతఁడు పవనజునకు, వినిచె స్వవృత్త మిట్టి♦వెరవున మహిళా! ౭౯

—♦ లక్ష్మణుఁడు హనుమంతునకుఁ దమవృత్తాంతము వినుచుట. ♦—

ఆ॥ శ్రీయుతుండు సుప్రసిద్ధుండు దశరథా
ధీశుఁ డవనితలము ♦ నేలెఁ బెద్ద
కాల మితఁడు ద్వేష్ట ♦ కాఁడు ద్విష్టుఁడు లేఁడు
మేలటంచుఁ బ్రజలు ♦ మెచ్చి పొగడ. ౮౦

క॥ ఇష్టాపూర్తసమృద్ధి న, దుష్టతఁ గని తుష్టుఁ డగుచుఁ♦దోష్టో నిందుఁ బ్రిం
దిష్టునిగ నతనిఁ గాని తన, కష్టములం బాసెఁ బాపెఁ♦గర్బురతతులన్. ౮౧

తే॥ తాఁ బితామహాం పట్లు భూ ♦ తముల కెల్లఁ
బతియుఁ బ్రాణము ప్రాణమై ♦ పరఁగు నమ్మ

హోమహవ్యన కేము ప్రకృతుల ♦ మగ్రజుం డి
తండు రామాఖ్యుఁ డేలక్ష్మ ♦ ణుండ ననఘ! ౮౨

తే॥ ఎల్లసుగుణమ్ములకుఁ బుట్టి ♦ నిల్లు శరణ
మఖిలభూతమ్ములకుఁ దెల్వి ♦ కాలవట్టు
నాఁగ నొప్పు నీఘనుఁ బ్రజా ♦ రాగలహరి
తోడ నృపలక్ష్మియునుఁ గవఁ ♦ గూడ నెఱయ. ౮౩

ఉ॥ ఆడినమాట తప్పని న ♦ యంబునకు న్నరిగాఁగఁ గీడుమా
టాడఁగలేని తండ్రిఁ గని ♦ యానతిఁ గైకొని వైభవంబులన్
బోఁడిమితోడ వీడి ముని ♦ పోలిక వెల్వడఁ గాంచి సాధ్వియు
న్దోడన తర్లె నే నటులె ♦ తోఁ జెడఁబాయఁగలేక వచ్చితిన్. ౮౪

తే॥ పాయక విభాకరునిఁ గొల్చు ♦ ప్రభ యనంగఁ, గూడివచ్చిన యట్టి ♦ క్షోణిపుత్రి
సీతనాఁ జను నాయమ ♦ పూతచరిత, నెవ్వఁడా మొఱంగి కొనిచనె ♦ నేము లేమి.

క॥ చింతిలి యాయమ వెదకుచు, హంతల మర్దించుచును మ ♦ హాటవిలోనన్
గొంతవఱకు రా మమ్మ న, గాంతకుఁ జోకఁ డాక్రమింప ♦ నాతనిఁ జంపన్.

ఆ॥ దనువనంగ నొప్పు ♦ దానవుం డవ్వాఁడు
దివ్యరూపుఁ డగుచుఁ ♦ దేజరిల్లి
యినజు చెలిమి కలిమి ♦ నెనయంగ నగు మేల
టంచుఁ బలికి చనియె ♦ నమరపురికి. ౮౭

క॥ ఆదటఁ ద్రోవం గైకొని, యాదైవము కాల మొక్క ♦ పై నెఱి నూఁపన్
బ్రోదిది యగు తెఱవుగానక, కా దెదియును నవెడు తలఁపు ♦ గ్రందుకొనంగన్.

అ॥ తఱిమి వచ్చి పంపఁ ♦ దరిగాంచి యద్దాని, మురువు మెచ్చి ఋశ్య ♦ మూకమునకుఁ
జేరఁ బాఱుతఱిని ♦ చేరంగవచ్చితి, నీవు సుకృతరూప ♦ నియతి వెలయ. ౮౯

తే॥ తాతతండ్రులు మున్నుగా ♦ దయితు లోడ్లఁ, బ్రోవఁ జాలినవా రట్లు ♦ బ్రోచినారు
తారె యట్టికులమున నీ ♦ తరమునందు, మాముఖంబున నర్థులై ♦ మలసినారు. ౯౦

సీ॥ తపనుఁ దేజునకల్మిఁ ♦ తార్క్ష్యుణ గావించు, తేజస్వి తపసియై ♦ తెలిఁగుఁ బాసె
నర్థులపాల నే ♦ నని ప్రోచు దొర యొడ్లు, నర్థింపనై యిట్టు ♦ లలఁతిపడియె
శరణన్న నరి నేనిఁ ♦ జాలి మన్నుదయాళు, వభయ మం చనువారి ♦ యడఁగోరె
మాయదారుల రూపు ♦ మాప నేర్చిన ప్రోడ, మాయరక్కను చేత ♦ మలఁకమలఁగె

నెంచి ముల్లోకములకంట ♦ నెత్తివచ్చె
నేనిఁ దలఁకని దంట యి ♦ ల్లెడలి బడలె
నోడలం బంట్లు బండ్లపై ♦ నోడ లెత్త
నైన విధి కివి వింతలే ♦ యనిలతనయ ! ౯౧

క॥ జగదర్చ్యుఁడు విశ్వజనీ, నగుణాఢ్యుఁడు నాకలోక ♦ నాయకునైనం
బొగడఁ దగఁడుపడఁ డిన్నరి, నొగు లొందుట చోద్య మయ్యె ♦ నుతసచ్చరితా !

తే॥ అవనిజ నయోనిజాతమ ♦ హానుభావఁ
జెనయఁ జూచెడు చెడుగప్పై ♦ చెడక పోవఁ
డిమ్మహామహు నెదిరించి ♦ యేనిఁ బ్రదుకఁ
డమ్మహిత యొంటి నవయుట ♦ కడలవలసె. ౯౩

క॥ ఈ వడిగిన వృత్తాంతఁ, బావంతయుఁ దిక్కకుండ ♦ ననలసఖసుతా !
నే వినిచినాడఁ గర్జం, బేవలనునఁ జక్కఁబెట్టుతో ♦ యిది నీయదిగాన్, ౯౪

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణుల సుగ్రీవునిదరిఁ జేర్చుట ♦—

తే॥ మిత్రనందను గోడి స ♦ న్మైత్రి కలిమి
మేలు గూర్పంగ నదియు నీ ♦ మేలె యనుచు
సాశ్రులోచనుఁ డై పల్క ♦ హనుమ యలరి
మిత్రనందనుఁ డైన సా ♦ మిత్రి కనియె. ౯౫

ఉ॥ ఇంత మహానుభావు లని ♦ యిల్లర యందగు భావ మబ్బె మీ
చింత తలంకఁ డింక విధి ♦ చేకురఁ జేసెను మేలు పాల్పడన్
వంతన మెక్కట న్నవిత్ర ♦ సంతతివారలు మీరలౌటఁ దుర్
మంతన మొప్పఁ జేరఁ గని ♦ మాలిమి మీట వెలంగఁ గల్గుటన్. ౯౬

ఉ॥ పోవుద మర్క్య యాతఁడును ♦ బోఁడిమి దక్కి సహాయయోగ మె
ట్లేవగ నేనియుం దనకు ♦ నేర్పడునో యని వేచియుండె నా
కావరుఁ డింద్రజుండు తనుఁ ♦ గాసిలఁ జేసిన కారణంబు తా
నే నమకూర్చు నొండొరుల ♦ యిష్టముల న్విధి ప్రేరణంబునన్. ౯౭

క॥ సమదుఃఖసుఖులు తా ర, త్యమలహృదయు లవుటకతన ♦ నన్యోన్యసహా
య మొనర్చికొని స్వరాజ్యా, గమమున మే లెనయువారు ♦ గాఁగలరింకన్.

వ॥ అని శ్రీరాముని నెమ్మొగమ్ము సమ్ముఖమ్ము సేసికొని. ౯౯

తే॥ రమ్ము నాయన్న! యినజుఁ జే ♦ రఁగ నిపుడె
తమ్ముఁడును నీవు సమ్మతిఁ ♦ దనరుచుండ
నేము నాతండునై ♦ న మహీతనూజ
నందఁజేసెద మాయుమ ♦ వరిసి కాంచి. ౧౦౦

ఆ॥ అనిన సంతసించి ♦ యాతని నగ్గించి
తాను ననుజుఁడును వి ♦ ధాన మరసి
సమ్మతమ్ము నూప ♦ సామీరి మెయి వెంచి
తనభుజముల వారిఁ ♦ దనరఁ జేర్చి. ౧౦౧

క॥ మొనయఁ గని ఋశ్యమూకం, బున వారల డించి భీతిఁ ♦ బొదలెడు చిత్తం
బున మలయమువంకకుఁ జని, తన కాకకు వేచుచున్న ♦ తపనతనూజున్. ౧౦౨

వ॥ సందర్శించి యెల్లవృత్తాంతం బెఱింగించి యాతనిం దోడ్కొని వచ్చి రఘువీరుల సన్నిధానంబు వడయం జేసిన. ౧౦౩

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునితో సవినయముగఁ బలుకుట. ♦—

క॥ వంత తలఁగ సంతస మ, త్యంతసమృద్ధంబుగా న ♦ నావిలవృత్తిన్
స్వాంతము తనరఁగ ఎలగొని, చెంత న్నిలువఁబడి పలికెఁ ♦ జిత్కళ లొలయన్.

ఉ॥ ధర్మవున న్వినీతిమెయిఁ ♦ దద్దమెలంగెదు విక్రమంబున
న్మర్మము నీకపో తెలియు ♦ మానితవృత్తివి వత్సలుండ వీ
నిర్మలమూర్తియందు నలి ♦ నీవిభు తేజము బింబితంబుగా
దుర్మతవర్గము న్దొలఁచ ♦ దోఁచిన యియ్యవతారసంపదన్. ౧౦౪

ఆ॥ తెలిపితనయ్య! నాకుఁ ♦ దేటతెల్లంబుగ, నిదుగుణము లెలమి ♦ నిర్మలాత్ముఁ
డీసమీరసూనుఁ ♦ డిన్నియు భవదీయ, దర్శనమున స్పష్ట ♦ తరము లయ్యె. ౧౦౫

క॥ కాదే మహాప్రసాదము, నీదర్శన మిదుటె కాక ♦ నెమ్మిని సఖ్యం
బీఁదలఁచి వచ్చితిని నే, నీదయితున కంటె కోర్కి ♦ కిది నుగమంబే. ౧౦౬

తే॥ సిద్ధముగ నున్న దీచేయి ♦ చేయి సాపు, మింక జాగేల రవిజుండె ♦ యితఁడు భాను
వంశపావనులరు మీరు ♦ వచ్చెఁ జెలిమి, యెట్టి మర్యాద నెలయింప ♦ నోతొ రామ!

క॥ తమ్ములు నీ కిందఱలోఁ, దమ్ముఁడ నే నొకఁడఁ జుమ్ము ♦ తాత్పర్యమునన్
గొమ్మింకిట నీభారమె, నమ్ముము కింకరుఁడ మీఁద ♦ నా కెవి సెలవో. ౧౦౮

ఆ॥ అనిన రాముఁ డతని ♦ హస్తమ్ము హస్తమ్ము, నేర్చి చెలిమి యిది యె ♦ సిద్ధ మనుచుఁ
గౌఁగిటం గదించెఁ ♦ గర్మసాక్షితనూజుఁ, దేజు పెనుపుఁ దోన ♦ తెలియఁ బడఁగ.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునితోఁ సవినయముగఁ బలుకుట. ♦—

చ॥ అనలునిఁ బ్రజ్వలించు నటు ♦ లయ్యనిలాత్మజుఁ డ ష్ఠానర్చినన్
మనములు పొంగ సత్కృతిన ♦ మాహితులై వలగొంచు వచ్చి య
య్యినకులపాళి భానుజుఁడు ♦ నేకవచస్కత మైత్రికల్మిఁ బొ
యని నియతిం జరింతు మిఁక ♦ నంచుఁ బ్రతిజ్ఞఁ బొనర్చి రయ్యెడన్. ౧౧౧

క॥ నింతుమనంబుల నవ్వా, రొండొరులం గనుచుఁ దృప్తి ♦ నొలయని దృష్టు
ల్కొంచుకొని నెఱయ నమ్మియుఁ, గొండొకతడ వుండి రాస ♦ గొనకొనుచుండన్.

క॥ అంతటఁ దాపని కెంలుక, దంతురితశరీర మొప్ప ♦ దాశరథిపద
ప్రాంతరఘుటితకరుండై, సంతసమున సనియె నిట్లు ♦ సంయమివినుతా! ౧౧౩

ఆ॥ కష్టమైన సుఖము ♦ గావంగనైన తే, దర యొక్కతి రఘుకు ♦ లాబ్ధిచంద్ర!
యోవయస్య! యిట్టి ♦ యోజ నీకును నాకు, నేమి సుకృత మిడెనొ ♦ యింత ఫలము.

మ॥ అని పూవు ల్దళము ల్దలిర్ప లలితం ♦ బై యున్న యొండొక్క శా
ఖనుఁ జేచేఁ గొని తెచ్చి రామునకు శ్రీ ♦ కల్యాణసౌగుణ్యధా
మునకు న్విష్టరము న్బొనర్చి భుజము ♦ ల్పొంగంగ నద్దేవు నా
జ్ఞను గూర్చుండ సహాసనస్థిత సమై ♦ శ్వర్యంబు చేకూరఁగన్. ౧౧౪

ఉ॥ చందనవృక్షశాఖ నటు ♦ ప్పర్శనసూనుఁడు తెచ్చి భక్తిమ
చ్చందనశాఖ యమ్మగధ ♦ జానకు జాతున కుంచె నంద తోం
పొందుచు నిష్టగోష్ఠిమెయి ♦ నుండఁ బురస్కృతు లొప్ప రాము మో
మందున చూడ్కి నిల్పి మిహి ♦ రాత్మజుఁ డిట్లనె హర్షపూర్ణుఁడై. ౧౧౬

—♦ సుగ్రీవుఁడు తనకష్టములఁ జెప్ప రాముఁ డభయ మిచ్చుట ♦—

క॥ జీవింపఁగ శుభ మొనయుం, గావచ్చు నటన్న నీతి ♦ కదుఫలవతియై
నావలనున గనుపట్టెను, దేవ! త్వదాశ్రియము తనకు ♦ దిట వానగూర్పన్.

తే॥ అన్న నను గిట్టి నాదార ♦ నపహరించి, వాలి కడువాలి తోలంగ ♦ వలను లేక
చేరితిని దీని నీకొండఁ ♦ జెవయుబ్బుఁడు, మానిశాపాత్రరస్మృతి ♦ మానుపఱుప.

ఆ॥ అతనితోడి వైర ♦ మంత లింతలు సేయ, నున్న రూపు పెడఁగ ♦ నుంటి నిట్లు
నాదు భయము గెడపి ♦ నను గొమ్ము నీయాన, మెలఁగువాఁడ నెలమి ♦ మేకొనంగ.

వ॥ అని విన్నవించిన. ౧౨౦

ఉ॥ తేజున గన్నగౌరవము ♦ తెల్పిని దేటను బ్రస్తుతింప నా
యోజనే ధర్మసంగ్రహము ♦ పొలాన్నతి వాఙ్మనసప్రయుక్తిమై

రాజిల రాజయోగమున ♦ రాణఁ దలిర్చుచు రూఢిఁ బెంపు ని
ర్వ్యాజత నైజ మంచన న ♦ పార్వతివంశకిశోర మిట్లనున్. ౧౨౧

ఆ॥ భానుగాత విదిత ♦ మనఘ! మైత్రీఫలంబు, పాపమనక నీదు ♦ భార్య నొడిచి
కొన్న వాలిఁ ద్రుంచి ♦ కొనకొని యాతని, సిరికి ని న్నధీశుఁ ♦ జేతువాఁడ.

తే॥ అశనిసదృశము లై గఱు ♦ లంది నిశిత
ములు సుపర్వములు నగు తూఁ ♦ పులు ఘను లనఁ
దొడరుచున్నవి కడఁక నా ♦ ధూర్తు వెనకఁ
బుట్టలం జొలు నమ్ముల ♦ పొదులనుండి. ౧౨౩

కం॥ వీకమున భయ మింకిట నీ, సూ డగు నతఁ డెదిరి మాఱుకు చూచెడు నవి నా
వాఁడిని తెక్కలు తెగి గిరి, పోఁడిమి చెడి కూలుభంగిఁ ♦ బుడమిం బడఁగన్.

ఆ॥ అనుచు భానుజునకు♦నవ్విభుం డభయం బొ, సంగు నప్డు జనక♦జకుఁ బ్లవంగ
దానవేంద్రులకు న ♦ దరె వామనేత్రము, ల్పద్మహేమరుచిని ♦ భమ్ము లగజ!

—♦ సుగ్రీవుఁడు శ్రీరాము నూఱడించుట ♦—

కం॥ అంతట సుగ్రీవుఁడు శ్రీ, మంతుఁడు రఘురాముతోడి ♦ మాలిమిఁ బొడ వౌ
నంతసమున హృద్గతశో, కాంతమనము విడియఁ బలికె ♦ జతనము మెఱయన్.

ఆ॥ అన్న తెలిపె సచివుఁ ♦ డాప్తుండు హనుమ ని
ర్జనము వనము మీఱ ♦ లెనయ నైన
యానిమిత్త మట్టు ♦ లాదట మొనసిన
యంతరాయ మదియు ♦ నంతవట్టు. ౧౨౭

ఆ॥ మీరు లేనితఱిని ♦ మెయి వెంచి యాచెట్ట
రక్కసుఁడు హరించె ♦ రాణివాస
మెఱిఁగి యడ్డుపడిన ♦ హితు జటాయువుఁ ద్రుంచి
యైన నామె శక్య ♦ మగునె తనకు. ౧౨౮

కం॥ శక్రాదుల కేనియు ని, ర్వక్రచరిత్ర జనకదుహిత♦వలనే చనయన్
విక్రాంతు లగుచు సాధ్వుల, పరిక్రమమునఁ జెడరె మున్ను♦పాపాత్ము లిలన్.

ఉ॥ ఏగతి జీర్ణ మాను విష ♦ మింతయుఁ జేరిన యున్న మీఁగతోఁ
దోఁగిన నేయియున్ సతుల ♦ ధూర్తత నాఁచికొనంగ నెంచియున్
దాఁ గెడయు న్వనింద్యుఁ డగు ♦ ధర్మమయి. న్భవదంగనామణిన్
లోఁగొన నెంచెనేని సటు ♦ లోఁబడు దైత్యుఁడు నాదు శక్తికిన్. ౧౩౦

కం॥ ఆయమవియోగమున కీ, వోయయ్యా! యడలవలవ♦దోగి శత్రి వట్ల
మ్మాయమ నీ కెడసి వతి నే, నే యెఱుఁగవ నీమదిచిత్త♦మెలయఁగ రామా!

తే॥ ఇంక సందియ మందకు ♦ మినకులాబ్ధి
చంద్ర! మాయమ్మఁ గాంచిన ♦ చంద మిప్పు
డనుమితం బయ్యె రామరా ♦ మా యటంచు
నాకసంబునఁ జనిన య ♦ య్యానువు దలఁప. ౧౩౨

కం॥ అద్దేవి నిన్నుఁ బాసి వి, పద్దశ తనుఁ జుట్టఁ గురరి ♦ భంగి నఱచుచున్
మొద్దు దివిజారి కొనిచను, నద్దానిని జూచినయ్యె ♦ నయ్యా! నాకున్. ౧౩౩

తే॥ పన్నగేంద్రవధూమణి♦భంగి నున్న, యబలఁ జేకొని రక్కసుం♦డరుగుచుండ
నిచట నుంటిమి నలువురు♦నేను స్వీయ, కృత్యచింతనమున మది♦గిరికొనంగ.

తే॥ ఎంత యుద్దేశ ముండెనో ♦ యెఱుకపడదు
తనదు చేలాంచలమున నా ♦ తల్లి ముల్లె
నేసి యాభరణమ్ములు ♦ చేరవిడిచె
నేము గొనితెచ్చి యునిచితి ♦ మింతవట్టు. ౧౩౫

కం॥ ఆముల్లియ యాచేలము, నీమదిఁ దొలుతఁ బరికించి♦నెఱవు మనఘ! యా
శ్రీమతి నారయుతలఁపున, కా మంగళసంవిధాన♦మనుబంధముగన్. ౧౩౬

ఆ॥ అనినఁ బ్రియవయస్య! ♦ యాలస్య మిం కేల
యదె మహార్హ మదె మ ♦ హాప్రసాద
మిట్టివలనువలన ♦ నెడపెట్టు మీసఖు
జీవితాశ మలఁచు ♦ చెట్టు తలఁపు. ౧౩౭

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు సీత సొమ్ములమూటఁ జూపుట. ♦—

మ॥ అన నుప్పొంగుచు నర్కజుండు గహనం ♦ బౌ తద్గుహాగర్భసీ
మ వసామాన్యతఁ బెట్టియున్న యవి నే ♦ మం బొప్పఁ గైకొంచుఁ జ
య్యన శ్రీరామున కర్పణం బొనరఁజే ♦ యు న్బాష్ప సంరుద్ధుఁ డ
య్యెను నీహారము గ్రమ్మఁ జందురునియ ♦ ట్లీక్షింప లోకేక్షణా! ౧౩౮

తే॥ గద్గదిక దోఁప ధైర్య మొ ♦ క్కట్టుఁ దలంగ
హా ప్రియే యని యవనిపై ♦ నతఁడు వ్రాలె
నంతమాత్రన సామాన్యుఁ♦డవఁగ రాదు
స్నేహబంధ మ్మనర్పడి ♦ స్థితి యెఱింగి. ౧౩౯

—◆ శ్రీరాముఁడు దుఃఖించుట. ◆—

క॥ అనదృశుఁ డాతఁడు బిలమున, బుసకొట్టెడు సర్పమట్లు◆పొరిఁబొరి నురుని
శ్శ్వాసమరుత్తులు నైకొన, దెసఁగాని నమ్మూడియు నెదకుఁ◆దివిచి వయస్యా!

ఆ॥ అశ్రుపాతవేగ ◆ మప్పు డవిచ్ఛిన్నమై, యయ్యమూల్య భూష ◆ ణా బరాళ్య
మగు పరిపాతితలము◆నంక తోడ నైయున్న, యనుజుతోడ రాముఁ◆డిట్టులనియె నిట్లు.

క॥ అన్నా! లక్ష్మణ కంటివె, యన్నాతిమణియు పైని ◆ నదలున ఏకా
దిన్నని పచ్చికపైఁ బడి. యున్నవి యున్నట్టి రూప ◆ మొప్పఁగ నింకన్. ౧౪౩

ఆ॥ అదియ యుత్తరీయ◆మాభరణమ్ములు. నవియ కాఁగ నోపు◆నరయుమయ్య!
తవిలి యువిద పాట్లు◆ధారణ నెడలించె, ననిన నాతఁ డిట్లు◆లనియె నప్పుడు.

తే॥ ఎఱుఁగనయ్య! కేయూరమ్ము ◆ లెఱుఁగఁ గుండ
లమ్ము లటు లాఁతిసొమ్ముల ◆ యిమ్ము లెఱుఁగ
నమ్మ నూపురములమాత్ర ◆ మరయఁ గాంతు
నిచ్చలుఁ బదాభివందన ◆ నిరతిఁ జేసి. ౧౪౪

క॥ అని యడలిన నినజునిఁ గని, యనఘా! సుగ్రీవ! రాత్రి ◆ సాధముఁ డమ్మా
నిని నెమ్మెయిఁ గొనిచనె నే, మని యాపతి యడిచె నరిగె ◆ నతఁ డేమెడకున్.

సీ॥ నాబహిఃప్రాణంబు◆నవయంగ నెచ్చోట, నుగ్రరూపుఁడు దైత్యు◆ఁడునిచినాఁడొ
నా కెగ్గు పొనరించి ◆ నాఁడు తా నెల్లరా, త్రసులఁ జంపింపన ◆ కాకయున్నె
మిత్త్రి వాకిలి దీయ◆మేకొనె నిల్లది, తనచేటుమం దంచుఁ◆దలఁపవలదె
యెదిరెనేనియు వాని◆నిప్పుడే పరిమార్తు, దొంగవాఁ డెచ్చోట◆దొరకునొక్కొ
యుసురు లున్నవి రక్కసు ◆ నుక్కుమడఁపఁ
గానిచోఁ బ్రియ నెడఁ బాసి◆గాసిపడవె
యింత విధి నేర్పు వెర వింక ◆ నేమి గలదొ
తెలుపుమోయయ్య హరిముఖ్య! ◆ తేటపడఁగ. ౧౪౫

—◆ సుగ్రీవుఁడు రామునకు శోకోపశమనము చేయుట ◆—

క॥ అని దీనత రాముఁడు పలి, కినఁ గేల్గవ మోడ్చి తోనె ◆ కీశవిభుండి
ట్లనె నెఱుఁగనయ్య! యప్పా, పుని స్థలబలపౌరుషములఁ ◆ బోలఁగ నెపుడున్.

ఆ॥ ఐన నేమి వాని నంతెర మరసి నా, ధింప మహిజవార్తఁ ◆ దెలిసి తెలుప
నేన చాలువాఁడ ◆ నిదె యత్నమొనరింతు, నీదు మానసమున ◆ ఖేద మెడల.

క॥ దేవ! యచిరకాలముననె, దేవి భవత్సన్నిధి న్ను ◆ దిత యగా నిజ మీ
నావచనము సేవింపఁగ, నై వెలసెద యుష్మదంచి ◆ తాంఘ్రినళములన్.

సీ॥ అవికారపేశుండ ◆ వగు నీకుఁ దగునయ్య!, వైక్లబ్యమున కిట్లు ◆ వశపడంగఁ
దేజమ్ము ధృతిఁ దెల్పి ◆ చేటలఁ జెరలించు, శోక మాంతరసీమఁ ◆ బ్రాకినంత
నన్నుఁబోంట్లనుఁ దేర్చ ◆ విన్నను వుచితంబ, ఘనా నాదు విన్నప ◆ మాలకించి
యాత్మశిక్షితస్థైర్య ◆ మవలంబనము సేయు, నీ సత్త్వమునకల్మి ◆ నెగడు మింక

మలఁచు నార్తిఁ గష్టమ్మున ◆ మలఁకఁ బ్రాణ
భీతి నేనియు సదసద్వి ◆ వేచనంబు
నీయెఱుంగనిదే యిది ◆ నిర్మలాత్మ!
దీనజనపాల భక్తపి ◆ ధేయ! రామ! ౧౫౦

క॥ భారం బెక్కుడుగా జల, పూరమున న్మునిఁగి యోడ ◆ పోలియదె శక్యం
భారం బట్టిదకాదే, పూరుషునిం బాడవడంపఁ◆బురుషోత్తంసా! ౧౫౧

క॥ ఇది యుక్త మయుక్తం బిది, విదితం బిది యనఁగ నొందు◆వేత్త గలఁడె ని
న్నదిరి వచియింపఁ ద్వత్సౌ, హృద మిటు ప్రేరేప దీని◆కేదారకొంటిన్. ౧౫౨

తే॥ నీకు మ్రొక్కెద నీతివి ◆ నీతినిపుణ
తావిశేషంబు లొప్పారఁ ◆ దలఁపుమయ్య!
యాత్మతేజమ్ము దాన స ◆ య్యారుల గెలిచి
స్వీయసామ్రాజ్యలక్ష్మిఁ గై ◆ సేయు మయ్య! ౧౫౩

వ॥ అని యిట్లు మృదుమధుర సాంత్వనవచనరచన లనువొంద సుహృద్భావభావనా
యోగంబునం దలకొన్న తిన్నని చనవున సుగ్రీవుం డంచితగ్రీవుండై మన్నన
పెనుపార విన్నవించిన. ౧౫౪

ఉ॥ అంకిలి దేఱి తీయఁదన ◆ మందిన కన్నుల బాష్పరోధపుం
బింకము దీర్చి వత్సలత ◆ పేరిటి పేరిమి నించు చూడ్కు లా
వంకకుఁ దార్చి యర్కజుని ◆ వల్లభుఁ డంచితగాఢయోగము
ద్రాంకితుఁ జేసె బాహుయుగ ◆ ళాంతరసీమఁ గదించి నేర్పునన్. ౧౫౫

ఆ॥ పలికె నిట్లు బంధు ◆ భావమ్మునకు స్నిగ్ధ
ధర్మమునకుఁ దగిన ◆ దారి నొడివి
సమయమునను దేర్పఁ ◆ జాలితి నినుఁబోలు
హితుఁడు గలఁడె గెలిచి ◆ తిన తనూజ! ౧౫౬

సీ॥ ఇంక జతనంబు సలుపుము ♦ హితుఁడ! సాధ్వి
వల వరయ రక్కసుండు రా ♦ వణుఁడు కౌద్రిఁ
జతిదురాత్ముండు పోయిన ♦ యట్టి పోక
తెలిసి యమ్మూర్ఖు శిక్షించు ♦ తెఱఁగుఁ బెరయ ౧౫౭

॥ నీవు కర్జ మిపుడె♦నేఁ దీర్పఁ దొలకరి, యందు మంచి పొలము♦నంది పైరు
లట్లు నన్నుఁ జేరు♦న వ్యాపి కోరిక, లెన్నియును ఫలించు♦నింత నిజము. ౧౫౮

॥ అని పలికిన మంత్రులతోఁ, ననుమోదితుఁ డగుచు రవిజుఁ♦డాదట శ్రీరా
ముని సౌమిత్రిసమేతుని, గని యిట్లనె సత్సమానము♦గడలుకొనంగన్.

॥ దేవత లెల్ల నావెతలు ♦ దీర్పఁదలంచిరి నోము లెల్ల ని
ష్టై వెలసె స్వబాంధవుల ♦ నిష్టులఁ గూడి మనంగఁ గంటి నో
దేవ! స్వరాజ్య మేల సుర ♦ సెవ్వని రాజ్యము నేని నేల నా
నీవె హితుండ వై యెనసి ♦ యొంతయు నేనియుఁ బూనియుండఁగన్. ౧౬౦

॥ పారయఁబోవ దనఘ!♦పారపొచ్చె మొకయింత, సుజనమైత్రికలన♦చొప్పడంగ
నైనఁ జాలు నెల్ల యర్థంబులం దేమి, యుసురు లొసఁగు నంత♦లొదవనేని.

॥ నిన్నుఁ బోలు మహాత్ముండు ♦ నెఱయ టరిది
యొలసెనేనియు విడుమఱ ♦ యుండఁబోదు
సంయముల ధృతి యట్లఁడె ♦ సజ్జనౌఘ
మందఁ గనినట్టి ప్రీతింపు ♦ ననఘచరిత! ౧౬౨

॥ అర్థ్యుఁ డైనఁ బేద♦రైన శక్తుం డైన, శక్తిహీనుఁ డైన♦నఖ్య మొదవె
నేని నతఁడ చూవె♦యిందు నందును గతి, యందు రెవుడు మహితు♦లైన జనులు.

॥ నాకూర్పు భవత్సేవయు, నాకాధిపవంద్యచరిత ♦ నలినాప్తకుల
శ్రీకర! నీచిత్తమునకుఁ, జేకూర్పు ప్రాప్తి నింకఁ ♦ జెప్పఁగనేలా. ౧౬౪

॥ అభయముఁ బ్రతిష్ఠ నొసఁగెదు, విభుఁడవు నీ వుండఁ దనకు♦వెఱ పేల యిఁకన్
శుభముల కాంచెద నిట ని, య్యుభయము సమసుఖము పొల్చు♦నుర్వీజాప్తా!

॥ అనిన రఘురాముఁ డిట్లను, ననఘా! యుపకారఫలము♦నందును మిత్రిం
బనయ మపకారఫల మరి, గనుఁ డెఱిఁగిదె కాదె యొందు♦గామన కగునే.

—♦ శ్రీరాముఁడు వాలివిరోధకారణము సుగ్రీవునడుగుట ♦—

॥ నీకు సోదరునకు ♦ నెటి దప్పి యిప్పగ, నేల పొడమె నిక్క ♦ మే వచింపు
మింతివ స్రైతింగి ♦ నే ననంతరకృత్య, మాచరింతుఁ గని బ ♦ లాబలముల.

తే: సఖుఁడ! నీయవమానమ్ము ♦ సరణి విన్న
యది మొదలుగాఁ బొడమెచుండె ♦ నత్యమర్ష
మేను నీకిఁ బొంచు సంధించి ♦ యేసి నంత
నతఁడు మనఁబోవఁ డింకుల ♦ కడుగవలసె. ౧౬౯

క॥ అని విస్పష్టముగా నొడివి, విన సచివవరేణ్యు లార ♦ విప్రతిభువు మే
లనుపపదె ననుచు సంతిస, మునుఁ దేలిరి హరివిభుండు ♦ మునుకొని పలికెన్.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకుఁ బ్రత్యుత్తరమిచ్చుట ♦—

తే॥ ఋక్షవిరజుండు నాఁగ మా ♦ కిందుఁ డొకఁడె
యయ్యె జనకుండు జననియు ♦ నయవిశేష
గతి మాకిందుఁ బ్రీలసంయమ ♦ కలన మాకు
నతఁడు వాలి సుగ్రీవుండ ♦ నైతి నేను. ౧౭౦

మ॥ అనఘా! తండ్రి చనంగ రాజ్యమును న ♦ య్యగ్రంబుఁ బాలింప జ్యే
ష్ఠు నిమంత్రించిరి మంత్రులాతఁడు మహా ♦ శోభాఢ్యుఁ డై యేలె నే
నునుఁ దత్సేవఁ బొనర్చుచుంటిఁ జెలుము ♦ ల్యాత్మంబులా యంచు నొ
ల్లనయం బాద్యతి మీఱ సన్నుతులు సే ♦ యం గల్మి పెం పొందఁగన్. ౧౭౧

ఉ॥ కావర మొప్ప స్త్రీకృతి నొ ♦ కం డరిఁ జేసికొని న్వారీను మా
యావిపదుండు రక్కసుఁ డ ♦ మా మ్మని మన్కికిఁ జేరి యొక్కనాఁ
డావిభుఁ బిల్చె యుద్ధమున ♦ కంబరముం బరసీమఁ ద్రోవఁగా
నావిశ్కృతస్వనం బెసఁగ ♦ వద్దమరేయి నతండు మూర్ఖుఁడై. ౧౭౨

క॥ ఆదుందుభిసుతు దర్పం
బాదివిజాధిపతనూజుఁ ♦ డారసి నుప్తి
న్వాదత్యాజనమునఁ గ్రో
ధోదయ మత్యధిక మగుడు ♦ నుజ్జ్వలుఁ డగుచున్

ఆ॥ ఎగసి దుముకఁబోవ ♦ నేనాత్తు లాగి రే, నేమి చెడియె నింత ♦ కిపుడె యంటి
వంగఱను నదల్చి ♦ యాతండు వానిపై, నుఱక త్రోమత్రోడ ♦ నొలయఁ గంటి.

చ॥ ఇరువుర మమ్ముఁ గాంచి మతి ♦ హీనుఁడు వాఁ డెడలంగఁ జొచ్చె స
త్వరముగ నేము ముట్టఁ జనఁ ♦ దత్తఱపాటున రక్కసుండు కం
దరమున దూఱెఁ జందురుఁడుఁ ♦ దా నొలయు న్నిశలందు వెన్నెలల్
దొరయఁగ నబ్బిలం బెవయు ♦ త్రోవయుఁ దోఁప నతం డభీకుఁడై. ౧౭౪

కం॥ నీ విచట నుండు మే సు, గ్రీవ! గుహాంతరము సొచ్చి ♦ క్రౌంచుపిసాచిన్
జావనడఁచి వచ్చెద నని, వేవిధముల వేఁడికొనిన ♦ వినక కడంకన్. ౧౭౬

ఆ॥ అడుగు లాన సుమ్ము ♦ టంచు నొట్టిడి పొచ్చి
నంతరాంతరాళ ♦ మా[illegible]
డవలఁ గడచె నొక్క ♦ హాయన మే నుంటి
నాన మీఱి కచట ♦ నంతవట్టు. ౧౭౭

కం॥ ఆతఱి నాతఁడు రామికి, భ్రాతృస్నేహమున వగచి♦పరిపరివిధముల్
చేతోవృత్తి నలంప న, నేతాదృశదశ చనిశ్చ♦ యేత్వఁమతినై. ౧౭౮

ఉ॥ ఉండ సఫేనరక్తనది ♦ యొయ్యనఁ బాఱె గుహాముఖంబునన్
గండలు దుండగీం డ్రఱచు ♦ కావరపు న్నడువ్ర ల్వినంబడెన్
గొండొకట న్నిరస్తుఁ డయి ♦ క్రోశన మీతఁ డొనర్చ నట్టిదై
యుండకఁ బాసె నయ్యదియు ♦ నాదట నే నరయంగ రాఘవా! ౧౭౯

వ॥ ఇత్తెఱంగున నత్తలంబునం గానవచ్చు నిమిత్తంబు లుపలక్షించి యయ్యది విపక్షుల విజయంబ కా నెంచి యెన్నరాని తత్తరంబున నన్న రామిం దలంచి నిహతుం డయ్యెనేమొకో యని శంకించి చింతాపరవశుండనై యరాతు లీదరిద్వారంబునం బఱతెంచి కిష్కింధానగరంబు నెయ్యన ముట్టడింప మొనకొందురో యను తలంపునఁ గొండం బోని గండశిల నాన షిరముఖంబున ఘట్టించి శోకించుచు భ్రాతకుఁ దిలోదకంబులు నమర్పించి పురంబునం బ్రవేశించి యావేళకం బగు నయ్యార్తి వెలిబుచ్చకయ కొండొకకాలంబు దనకు దైవానుగ్రహంబునం జేసి యాతండు రానోపునో యని మే లెంచి నిరీక్షించుచుండ మర్నం బరసి ప్రధానముఖ్యు లెల్ల నేకీభవించి యరాజకం బగు రాజ్యంబు మననేర దను యోజన మేకొనం బలాత్కారంబునం దదీయప్రజాపరిపాలనంబునకుం దన్ను నియోగించి యభిషిక్తుం జేసిన. ౧౮౦

తే॥ అతని రాజ్యమె యని భావ ♦ మందుఁ జేర్చి
న్యాయ మెడలంగనీక మ ♦ హాభరమ్ము
మోచికొని యుంటి నేనాఁట ♦ మొనయు నవుడె
యప్పనమొనర్తు నియ్యది ♦ యనుచు రామ! ౧౮౧

కం॥ అయ్యసురునిఁ బొరిగొని తా, నయ్యెడఁ జనుదెంచి తత్త్వ ♦ మరయక కడఁక
న్నెయ్య మెడలి నా నెయ్యురఁ, జయ్యన బంధించి కృద్వ♦శంవదుఁడగుచున్.

తే॥ రఘుకులోద్వహా ! యుద్ధమై కా ♦ రణము గాఁగ
నేఁ దలంకున ననిచిత ♦ శివానుమనః
లోకమున తరబడి యున ♦ రాక మీఁర
లేకతం జేకవీరు లి ♦ ల్లేగుదేర. ౧౯౨

క॥ నాపాలిభాగ్యదేవత, యే పనిచును మిఁ ప్పుఁ గడమ♦ మె ల్లనవలె ని
య్యాపదఁ గడవంబెట్టఁగ, శివయి బల విడితి నీదు♦ న కే మనునో. ౧౯౩

—♦ శ్రీరాముఁ డభయ మొసఁగ సుగ్రీవుఁడు వాలి బలపరాక్రమము లెఱుక సేయు. ♦—

ఆ॥ అనిన రాముఁ డనిను ♦ నన్న నీ వన కే వ
నంగ నొంను గలడె ♦ నాదు చూడ్కి
కాతఁ డెదురు పడిన ♦ యప్పుడే కడ శ్రేటఁ
గలఁడు వేయునేల ♦ కాంచె దదియు. ౧౯౪

క॥ నాకష్ట మట్టు లనుకొని, నీ కథయుం బొఃగినాడ ♦ నెతిదప్పి యిఁకం
జాకుండు నాతఁ డెమ్మెయి, నేకశరమ చా ను వాని ♦ నిద్దరఁ గూల్చెన్. ౧౯౫

తే॥ మేలు గాంతు వింక ♦ మెలఁకువఁ గను మన్న
రాముఁ బూజనేసె ♦ రవి దలిర్పఁ
బొగడె నర్కజుండు ♦ పొంగారు సంతసం
బునఁ బొసంగెఁ బలికెఁ ♦ బొనరుపడఁగ. ౧౯౬

ఆ॥ లోకనాథ! నీవు♦లోలతమైఁ బల్కు, తరమె కోపగించు♦ఁ కియ యేని
పరాఁడు చోటు లొక్క♦మొగిన కాల్పవె శర, జాలకీల ఁగువఁ♦జాల నెగడి.

క॥ ఐన రిపుబలాబలముల, నొనెఱిఁ గని నెఱపఁబోలు♦నాదటఁ గర్జం
బౌ నాతని పౌరుష మి, ప్రీనుడులె దెలుపువాఁడ♦నినకులతిలకా! ౧౯౮

తే॥ అతఁడు పడమటనుండి తూ ♦ ర్పుదు దక్కి
ణమున మునుకొని యటు లు త్త ♦ రమున కెగయు
నినునిరాకకు మున్నె తా ♦ నిన్నిపంక్తి
ముల మునిఁగి చేరుఁ గిష్కింధ ♦ కింతె యనక. ౧౯౯

తే॥ పేరుఁ బెనుపును గాంచిన♦పెద్దకొండ, లెక్కు శిఖరమ్ము లూటాడి♦మో యయవైచి
పట్టుకొను బంతు లాడించు♦పగిది నట్టి, చెట్లఁ దనగాలఁ దెరలంగ♦జేయు వడరి.

క॥ దుందుభి యను మహాకాకృతి, నొందిన పొలదిండిమేటి♦యొకరుఁడు రజ కా
దిత్రిం దెగడఁజాలు మేనున, బొందగు వారణనహస్ర♦పూర్ణబలమునన్. ౨౦౧

తే॥ మఱియు వరదానమహిమ న ♦ మ్మకము మదముఁ
బెరుఁగ ద న్నదిరిం గను ♦ పేర్మి దక్కి
యేఁటిపోఁటిమగనిఁ గాంచి ♦ యెసక మెసఁగ
రమ్ము నాతో దురమ్ము కి ♦ రమ్ము గాఁగ. ౨౦౨

క॥ అని యఱచిన సంరంభుఁ జా, లినవాఁడం గాను వనము♦లీలం దుహినా
ద్రి నినుం బోలినయది యా, తనికి స్నిహ సగు బోరి♦తము తగురీతిన్. ౨౦౩

తే॥ అతఁడు ముక్కంటి మామ శై ♦ లాధినాథుఁ
డేఁపుగడయ జేజేలకు ♦ నెల్ల తపసు
లకును నింతింత యనరాని ♦ లావు గలఁడు
నీకు సరియగుఁ గాంచెదు ♦ నీవ తొడరి. ౨౦౪

మ॥ అనిన స్వీభర్తుఁడు వీఁ డటంచు మదిలో ♦ నంతంతఁగా నెంచి చ
య్యన నయ్యద్రిశుఁ జేరి పిల్వ నతఁ డీ ♦ య్యాగమ్ము నాకేల మూ
ర్ఖునితో నం చగు రూపు గొంచుఁ దపసుల్ ♦ గూర్చుండ నిట్లుండ నై
తి నా గా కిద్వేషఁ బౌరుషం బరసిన ♦ న్నెల్లంబు గాకుండునే. ౨౦౫

క॥ నాపూర్వ కర్జ మెఱుఁగుము, నాకాశశ్మశ్రువర! య♦నమ్మిఁదు గలఁడ
ప్పాకారిసుతుఁడు వాలి యు, నేకులఁ గెడపె నతఁ డొక్కఁ డేలుఁ♦బ్లవగులన్.

క॥ వాలి యనఁగఁ గిష్కింధం, బాలించెడు వాఁడు నీకుఁ♦బ్రతిభటుఁ డగుఁ బో
మ్మాలమున వానిఁ గెలిచిన, నేలెద విజగతి కొకఁడ♦వేలిక యనఁగన్. ౨౦౭

ఆ॥ అనినఁ గొన్ని తాల♦నట్టు లిట్టులుఁ జిమ్మి, అంకె లిడుచు వీఁడు♦బింక మెడలెఁ
బొ మ్మటంచుఁ దిట్టి♦బొమ్మ యగ్గిరిపతి, కట్టె కట్టె దుర్మ♦దాంధుఁ డగుచు.

ఉ॥ ఆశరుఁ డద్రిఁ బాసి శర ♦ మట్టులు వాలి పురంబు సొచ్చి దు
ష్టాశయుఁ డై యదల్చి పరి ♦ ఘోరముఁ గొమ్ములఁ జిమ్ముచుం దరూ
ద్దేశముల న్దరల్చుచు క్షి ♦ తి న్ఖురదారితఁ జేయుచున్ రణా
వేశమున న్మహాజలద ♦ వృత్తి నభస్థలిఁ బర్వ నార్వఁగన్. ౨౦౯

ఉ॥ దుందుభి దుందుభిస్వనము ♦ తోన యొఱింగి కడంగి తారక
ల్బిందురు నట్లు దార లను ♦ సంగతి వీడక శోకనంగ న
మ్మందునిఁ జేరి నీదురభి ♦ మానము మానుము జీవితాశ లే
కుందువ యేని నిల్వు మిటు ♦ లొప్పని యార్భటు లేల నావుడున్. ౨౧౦

మ॥ కను లెఱ్ఱంబడ వాఁడు స్త్రీలకడ ని ♦ క్కాఁటు ల్గడిఁపం గ నే
మన నా నీబల మే నెఱిఁగెదను ర ♦ మ్మా సన్నఁ గాకుత్స్థ భో
గినులం దేర్పుము శాఖ్యాగ్రిసికికి ♦ స్త్రీలోకాల్పు మన్మూన్ద్రరిణ్
గపు మాహాత్మ్యము సత్కృపం బ్రమిలు లీ ♦ నాఁ డెల్ల ని న్వేఁడెదన్. ౨౧౧

ఆ॥ మత్తు సుప్తు నలు పరి ♦ మత్తు నెక్కటి యగు
వాని భీతుఁ డైన ♦ వానిఁ జంపఁ
జూడ రెన్నఁడేని ♦ శూరాగ్రణులు మాన
హీన మఘము వానఁ ♦ గానఁబడుట. ౨౧౨

తే॥ అనిన వెడనవ్వు నవ్వి య ♦ య్యతిబలుండు
తార ముఖ్నగు కోమల నం ♦ తఃపురమున
కనిచి పితృదత్త మైన య ♦ క్కనకమాల
నరసి సవరించుకొని కోర్కెధ ♦ మగ్గలముగ. ౨౧౩

ఆ॥ పలికె నోరి! వీర♦పాణజం బిది రిత్త, మడమ గాదు నిలుము♦మత మెఱింగి
నిన్నుఁ బనుచువాఁడ♦నీ వేగి జముని నా, హానముతోడి చెలిమి♦నందఁగనుము.

కం॥ అని నాడివి వానిఁ గొమ్ములఁ, గొని కొండంబోల నెత్తి♦కూల రణక్షో
ణిని వై చెఁ జెవుల ముక్కుల, ఘనరక్తస్రావ మెడలఁ♦గా గర్జిలుచున్. ౨౧౫

ఉ॥ వాఁడును దెప్పిరిల్లి బల ♦ వైరిసుతుం బడవైవ లేచి చే
వాఁడిని బాష్ణిఘాతములఁ ♦ బాదపశైలశిలాప్రయుక్తిఁ జే
ర్వాడి యలంచె స్వీయబల ♦ వర్ధన మాతని త్రైణ్యు మించి తో
ద్తోడన త్రిప్పి నెట్టుపయి ♦ దోర్బల మొప్పఁగ బిట్టు వైచినన్. ౨౧౬

ఆ॥ అంగసంధు లవియ♦నమ్మహారాక్షసుం, డుసుఱుబాసి కూల♦నుఱక యెత్తి
యోజ వైచె వాని♦యోజనాంతరసీమఁ, జలము బలము నెఱయ♦శక్రసుతుఁడు.

ఉ॥ శోణితధార పై కెగసి ♦ నూరెఁ బొసంగు మతంగకాననః
క్షోణిపయిం బడం దనువు ♦ హాకున బిందువు లందఁగాంచి యే
ప్రాణియొ యిట్టి డంచు ముని ♦ భావనసేసి యెఱింగి తో వని
దార్ణిరుపాకపాయితవి ♦ ధానవతాంచితచిత్తపద్ముఁడై. ౨౧౮

సీ॥ క్రోధ వ్యాకుల తఱి నొక్కఁ♦గూల్చున శాకేమి, యిచటి కిపీనుంగు♦నేల చిమ్మె
నిష్ఫలం బిమ్మెను♦నేవంపు నెత్తుటఁ, దోఁగ మేఁల్మాఁకులు♦దునిసిపడఁగ

సంతి చుల్కన తాప♦సాశ్రమం బయ్యెనే, మర్యాద గలదె ప్ర♦మత్తులకును
మా టెంచు లే రని♦మసలుచునున్నాము, తన కింద్రివరము సా♦ధక మటంచుఁ

గాలుఁ గో దీనిచుట్టును ♦ గలుగు నొక్క
యోజనము మేరఁ ద్రొక్కిన ♦ యుక్కుమడఁగి
పోవు నిమ్మార్గుఁ డీతని ♦ పొరువువారు
శిలలు గాఁగల రిమ్మేడఁ ♦ జేరఁగనిన. ౨౧౯

క॥ క్రోంతు లని మిన్నకుండిన, నాతరువుల ఫలము లెల్ల♦నమలుచు నేఁ డి
ట్లీతరఁబడి మే లెంచిరి, పాతక మగుఁగాదె చెడుఁగు♦పందలఁ జేర్పన్. ౨౨౦

ఆ॥ అని శపింప వినిన ♦ యంతనే యచ్చోట
నున్న క్రోంతు లెల్ల ♦ నటికి యురక
వాలిఁ జేరఁబోవ ♦ వాలి మీరిట్లు రా
నేల యనిన వార ♦ లింత నొడువ. ౨౨౧

పృథ్వి॥ మతంగముని వేఁడఁగా ♦ మలయునంత నమ్మౌన్యుఁడున్
వితండ మిఁకఁ జాలు నీ ♦ వెడఁగుతోడ నంచుం దదా
దృతిం దొలఁగి యాంతర ♦ స్థితి భజింప నిర్విణ్ణుఁడై
యతండుఁ బురి కేగె న ♦ య్యెద నెఱింగి నే నాప్తులున్. ౨౨౨

ఆ॥ అమ్మహాత్ము వేఁడి ♦ యాతని యనుమతి
వడసి యుంటి మింత ♦ పట్టు వట్టి
యాకళేబరమ్ము ♦ నమ్మెయి గిరిపొంత
నున్నయది హరీంద్రు ♦ నోజఁ దెలుప. ౨౨౩

క॥ ఏవిధి నబ్బలవంతుని, నీ వెడలించెదవొ రామ! ♦ నే నీబలస
ద్భావ మరయనేరమి నెది, యో వల వని యుంటిఁ దొంటి♦యోజన నెఱయన్.

— ♦ సుగ్రీవునకు నమ్మకముగలుగ రాముఁడు తనబలముఁ జూపుట. ♦ —

ఆ॥ అనిన సౌమిత్రి నీ కెద్ది♦యానవాలు, గాఁగఁ బొసఁగింప నెద నమ్మ♦కము జనించు
ననఁ గ నయ్యస్థిపంజర♦మ్మంఘ్రి నొకట, నెల మై మెఁ జిమ్మనగు న నె♦నినసుతుండు.

క॥ పప్పుచుఁ బది యోజనముల, కవ్వలఁ బడఁ జిమ్మె దాని ♦ నంగుష్ఠమునన్
మవ్వ మొలయ రాముఁడు దా, నివ్వెఱపడియున్ ప్లవంగ ♦ నేత వెరపునన్.

ఆ॥ ఇట్టు లనియె రామ! ♦ యిది మాంసపూర్ణమై
బలువు గలిగి యుండ ♦ బడలియుండి

యతఁడు వైచె శుష్క ♦ మై యున్న యస్థాని
హర్షకలనఁ జిమ్మె ♦ నైతి వీవు. ౨౨౭

శా॥ కానం గానఁగ నేర నీబలువు చ ♦ క్కం గాంచు మా చాల్పునన్
సానుస్థం బదె సాలసప్తకము ని ♦ ష్పత్రంబుగాఁ జేయ న
గ్రానువ్యాధము దోఁప నన్ని యొకఁడే ♦ మైయుండ ఘట్టింపఁగాఁ
దా నేర్చు న్ప్లవగేంద్రుఁ డద్దెసను నీ ♦ దార్ఢ్యమ్ము హాసింపవే. ౨౨౮

వ॥ అని యిట్లు రవిప్రతిరూపుండు నిరూపించిన. ౨౨౯

ఉ॥ అల్లన నవ్వుచు న్రఘుకు ♦ లాగ్రణి కార్ముక మంది యొక్క మే
ల్భల్లము వానిపై విడువఁ ♦ బాదపసప్తకముం దెరల్చి తోఁ
నల్లి నదిక్షేత్త్రృత ధ ♦ రాంతరసీమవిహారహారిత
న్దల్లమ్ము గా గడించి శర ♦ ధిస్థితిఁ గాంచె మహాస్త్రమాత్రిలోన్. ౨౩౦

క॥ అబ్బలువుంగోడి మెలఁకువ, యబ్బుర మొదవింప జగము ♦ లన్నియు నొకటన్
బ్రిబ్బికొన నోపు విధి కితఁ, డబ్బ యగుం గాత మని ప్ర ♦ హర్షాంచితుఁడై.

ఆ॥ ఫాలతలము నందుఁ ♦ బరఁగ నంజలి సేర్చి
సాగి మ్రొక్కి నిలిచి ♦ సంభ్రమమున
రాము మోము కలిమి ♦ రాణకై చూడ్కులు
పొదలఁ బొగడె భాను ♦ పుత్త్రుఁ డగజ! ౨౩౨

—♦ సుగ్రీవుఁడు శ్రీరాముని శక్తి నమ్మి కొనియాడుట ♦—

క॥ నిన్నదిరి నిలువ నోపునె, యన్నాళీకజుని సృష్టి ♦ నైన జన మెటో
కన్నవి నాయీకన్నులు, సన్నుతఁ యిన్నిలవు గడచు ♦ సంపద కలదే. ౨౩౩

చ॥ జగముల కెల్ల నాథుఁడవు ♦ చాలు దొనర్పఁగఁ జెంపఁ ద్రుంప నీ
మగఁటుము లెన్న నాతరమె ♦ మాలిమి కైతిని వాలి ...లియున్
దెగరె యెదిర్చ రేని నిను ♦ దేవుఁడ వీ విఁక సందియంబు లే
దగణితవైభవం బెనయ ♦ నయ్యెఁ బురాకృతపుణ్యసంపదన్. ౨౩౪

ఆ॥ వాలితోడి వైర ♦ వర్తనమునఁ గొన్న, వ్రతము నిష్ఠ నేఁటి ♦ వఱకుఁ బెరిగి
నిన్నుఁ గూర్చెఁ గాక ♦ నేర్తునే భవశత, మ్ములకు నేని నిట్టి ♦ కలిమిఁ బెరయ.

సీ॥ కర్మబంధవిముక్తి♦గాంచు నెట్లి మ్మేటి, కర్మము ల్పావరింపఁ ♦ గాంచి నరుఁడు
అవి దానిఁ బెనుచు నం♦చరయఁడు త్వన్మాయ, యాయవిద్యకు మూల♦మగుటఁ జేసి

నిశ్చలక్షేపంబు ♦ నియతిఁ జిత్తం బెప్డు, నీపదధ్యానంబు ♦ నెఱిఁ దనర్చు
నపుడె నకేమన ♦ నర్థావహం బది. నానానిబంధావి ♦ నాకృతంబు
గాన నీవు పాద ♦ కమలయుగ్మము నేను, గానవచ్చొ నొందు ♦ గాంక్ష సేయు
నొల్ల నిం భావ ♦ మొలయుంతు నిత్యసం, సేవనంబె తః కు ♦ జీవనముగ. ౨౩౬

మ॥ తల నీయంఘ్రుల నొవఁ దద్రజము తీ ♦ ర్థ బాడి సర్వాంగము
ల్వేలయ న్వ్రత్తనుస గిత స్మరము లే ♦ వేళ స్త్ర క్రియార్చలన్
మెలఁగ స్నీమకన ల్వినం జెవులు ని ♦ న్వీక్షింక గన్ను ల్వని
ర్మలగీతి స్తుతిఁ గూర్ప వాణియుఁ దలి ♦ ర్పఁ జేసి లాలింపవే. ౨౩౭

ఆ॥ నీమ భక్తు లున్న ♦ నెలవున కరుగంగ, నెమ్మి వారిఁ గూడి ♦ ని న్నుతింపఁ
గనెసువాఁడు పాత ♦ కవ్రజ మెడలించి, ముక్తిఁగాంచు నిత్య ♦ మోద మెసఁగ.

క॥ అలుం బిడ్డలు సంపద, లేలా త్వత్పాదభజన ♦ మే సౌఖ్యము నా
పాలుగఁ బొనర్ప నిమ్మెయి, జాలిటి సంసారబంధ ♦ సంక్షయకృతికిన్. ౨౩౯

క॥ కసు బడలితి సంసృతిఁ బడి, విడఁగంటి న్నిన్నుఁ గాంచి ♦ విశ్వాత్మ! యింకన్
బెడఁదోఁయకు మొం డొకఁడే, నడుగం ద్వద్భక్తిభిక్ష ♦ నర్థి నొసఁగవే. ౨౪౦

ఆ॥ అనిన సంతసిల్లి ♦ యర్కజుఁ జేసాచి, కదియఁ దార్చి బిగ్గ ♦ గౌఁగిలించె
రాముఁ డతఁడు దుష్కృ ♦ తామయదూరుఁడై, చాల నెగడఁగనె వి ♦ శాలనయన!

మ॥ కృతకృత్యత్వము గంటి తత్త్వ మెడఁద ♦ స్గల్గొల్పి తిబ్బంగి ని
న్నితరు ల్పోలఁ గలారె రాజ్య మిపుడే ♦ యేలింతుఁ దొల్లింటి యా
వెత లెల్లం దలఁగంగఁ గాంచెదు ధృతి ♦ న్వేవేగ నాదృష్టి కా
పతితుం బాల్పడఁ జేయఁ జూడు మవల ♦ న్బాణాగ్ని పా ల్సేసెదన్. ౨౪౨

క॥ కిష్కింధదారి సూపుము, నిష్కించనుఁగాఁ బొనర్తు ♦ నీపగతుని శో
చిష్కేశనిభాస్త్రంబున, పుష్కలప్రియవచనుఁ జేయఁ ♦ జూచెదె నన్నున్. ౨౪౩

ఆ॥ అనుచుఁ బలుకుచున్న ♦ యాజగన్మోహను, సుహుల నెఱికిఁ జిక్కి ♦ సూత్నకలనఁ
దనరి వారిఁ గొంచుఁ ♦ దత్పురవనవాటి, కరిగె భానుసూనుఁ ♦ డబ్జవదన! ౨౪౪

— ♦ సుగ్రీవుఁడు రామలక్ష్మణులతోఁ గిష్కింధ కేగుట. ♦ —

తే॥ వృక్షమండాంతరస్థు ల ♦ ప్పీరు లనువ
ద్వారతల మంది రవిజుండు ♦ తటిమి పిలువ
నైంద్రి యుద్ధప్రియుఁడు మదా ♦ హతుఁడు తోఁ నె
యురుగు దెంచెఁ గడంక ది ♦ వ్యాళిసేవ్య! ౨౪౫

క॥ ఆయోధన మాయినపుర, కాయె న్వ్యాయామ మరయ♦సంపదనిచ్చై
హేయనపథమున బుధభా, మేయగ్రహములకుఁ బోలె♦మితసంభాషా! ౨౮౭

వ॥ అట్టియెడ. ౨౮౮

ఆ॥ అశ్వినులకు నట్టు♦లవ్వాలి కొక్కంత, యంతరంబు చూపు♦లందు లేక
కలికి శర మమోఘ♦మాపట నేఁ బూనొ, యనుచుఁ దడసె రాముఁ♦డమరవంద్య!

ఆ॥ వరముకలిమి బలము ♦ వర్తమానము గాఁగ
మిగులఁ గ్రాలి వాలి ♦ మిత్రసుతుని
ముష్టితలనిహతుల ♦ మొత్తొని నొప్పింపఁ
దెరలి రక్తసిక్త ♦ దేహుఁ డగుచు. ౨౮౯

క॥ మదమత్తి త్రొల్లిఁటి యాశ్రమ, పదస్థలిం జేరఁగ శ్రమము♦బాపికొనము పో
వ్రిదికితి వని యవ్వాని, న్వదలి హరిప్రభుఁడు నిజని♦వాసం బెనసెన్. ౨౯౦

—♦ శ్రీరామ సుగ్రీవ సంవాదము ♦— —

ఉ॥ ఆదట రామలక్ష్మణులు ♦ నాకంగసూతియు భానుసూనునిం
బోల్చిది మెలర్పఁ దేర్పఁ జనఁ ♦ బోఁడిమి చేడ్పడ నాన పిల్లున
న్మోదము వీడి నెమ్మనము ♦ నొవ్వగ నెవ్వగ నున్న వాఁడు సీ
తాదయితుం గనుంగొనుఁడుఁ ♦ దద్దయు రోసము పొంగ నిట్లనున్. ౨౯౧

ఆ॥ ఎదిరి పాలు నేయ ♦ నేల నీ వింతకుఁ, జాలపోటు పగ్గ ♦ సటిచి మిన్న
కున్న నేమి యనుచు♦నొదుఁగ నాయునుజుపో, నవల నీతలంచి♦నదియు కాదె.

క॥ సఖ్యము తెలఁ గిట్టిదె పగ్గి, త్యాఖ్యానము సేసి తొల్కొ ♦ యానంగరముల్
ముఖ్యాముఖ్యత లరయ కు, పాఖ్యాన మొనర్ప నిట్టు ♦ లయ్యెన రామా!

క॥ నీకులము స్థలము ధృతి మహి, మాకూతం బ్రథజనస ♦మాదృతిఁ గని నే
నాకాంక్షించితిఁ గాకే, పాత్రికృతుఁడవొ యనిన నెలవ ♦ బాయఁ దలఁతునే.

తే॥ అనిన నాతని యడరున♦కడలి రాముఁ, డన్న! యొడ్డు పొడవు రూప♦మున్న తీరు
నొక్కఁ డనవయి కనుపట్ట ♦ నోజ దక్కి, స్త్రీయమాతివంక శంక ని ♦ ల్లేయనైతి.

క॥ నీకొండు పొసఁగ నేనియు, నాకడిమి పెడంగ నైన ♦ నగరే యొరు లిం
కేకలనఁ గడవఁ జాలుదు, శోకాంబుధితోడి దుర్య ♦ శోనిర్ఝరిణిన్. ౨౯౬

ఆ॥ ఆడి తప్పనేర్తు ♦ రయ్య! రాఘవు లొంట
నోట గలదె తమకు ♦ నుర్విలోన

హృదయ మెఱియ నయ్యె ♦ నిట్టి యీ తులమట
కే మనంగ నేస్తు ♦ నెఱిఁగి యెఱిఁగి. ౨౫౮

క॥ అని చిక్కని నగఁట నిడి, యనునయమునఁ దేవ్ర యింక ♦ నఱుము మొకట పే
వనటఁ దొలఁచెద గుఱు తఱు, తను తనరఁగఁ జేసి లక్ష్య ♦ తాత్పర్యమునన్.

తే॥ ఇంక శంకింపఁ వలవ దో ♦ యినతనూజ!
పిలుపు మీాతఱిఁ బోవఁ డా ♦ బిరుదు మరలి
మఱలఁ జనుపెంచి నాచూడ్కి ♦ మలసె నేని
నింతయు నెఱింగి యే వచి ♦ యించువాఁడ. ౨౫౯

శా॥ సౌమిత్రీ! గజపుష్పిక న్గుసుమల ♦ త్యన్నంబె యుద్దాన సు
శ్రీశాంతం బొనరింపు మీాతని మెడన్ ♦ శ్రేయమ్ము నేఁ గూర్తు ను
ద్దామావ్రిఖ్యుఁ డటంచు రాజ్యరమ తా ♦ దివ్యంబున న్మించి యు
ద్దామశ్రీ విలసిల్లఁ జేయ నగు చం ♦ దం బిబ్బ చె న్నొందఁగన్. ౨౬౦

—♦ రామాజ్ఞచే లక్ష్మణుఁడు సుగ్రీవు నకుఁ బుష్పమాల నంచుట ♦—

క॥ అనిన నా్రిముని యానతి, ననఘుఁడు లక్ష్మణుఁడు తన్మ ♦ హారంబున స
మ్మాన మునిచి తీర్పొలర్పఁగ, ఘనకౌతూహలము పొనరఁ ♦ గావించుటయున్.

తే॥ అతఁడు వక్షత్రిమాల ము ♦ న్నలమికొనఁగ
రాక నుదయించు చంద్రుని ♦ రాకరించె
మించె నట్లు బలాకాలి ♦ కాంచితమ్ము
సాంధ్యమేఘమ్ము పోసప్ ♦ సాదలలిత! ౨౬౧

క॥ అంతట లీలానిధి శ్రీ మంతుఁడు రఘురాముఁ డెలయు ♦ మాలిమిమై భా
స్వంతు సుతుఁ జేర్చి నంతను, మెంతయుఁ దనరారఁ దరలె ♦ నింద్రిజు పురికిన్.

మ॥ శరములు స్వర్ణపుంఖములు ♦ చారుతరం బగు చాప మొప్ప నా
స్మరరుచిరాంగుఁ డమ్మయి న ♦ సారత వగ్రిసరుండుగాఁగఁ దో
వరిగిరి తమ్ముఁడు నన్విజుఁ ♦ డంజనసూనుఁడుఁ గక్కువారు ము
ప్వొరును పవమత్సకత్వ మును ♦ పొంపిరివోవఁ దటంపు లుబ్బఁగన్. ౨౬౨

—♦ రామలక్ష్మణులతో సుగ్రీవాదులు మరల కిష్కింధ కరుగుట ♦—

తే॥ అలయ లలరారఁ గనువారి ♦ నాహరింపఁ
జాలి నలువొందు మేలి వృ ♦ క్షముల లతల
మహితరసపూర మొప్పార ♦ మగనిఁ జేర
నరిగెడు తరంగిణులఁ బ్రిసా ♦ దాధ్యగతుల. ౨౬౩

ఉ॥ అందము చందముం గలుగు ♦ హేముఖమ్ముల్ శిఖరంబులు స్థిరల్
పొందిన పూపొద ల్లెసరఁ ♦ బోఁడిమి నెక్కొను భూధరమ్ములన్
మందవిహారిగంధవహ ♦ మానితపద్మవనాంతశోభిసం
స్పందిమిళిందఝంకృతుల ♦ సద్రసపారసరోవరంబులన్. ౨౬౬

ఉ॥ అండలు దండలున్ సరసు ♦ లై తమ కుండఁగ హంసచక్రకా
రండవముఖ్యనీరఖగ ♦ రాజివిరాజితనాదమేదురా
ఖండితశాద్వలోత్కమృగ ♦ కాండవిఖండితకందమత్తవే
దండవిహారవర్తనుల ♦ తాపసిశోభితటస్థభూములన్. ౨౬౭

క॥ కాంచుచుఁ గాంచీరవము, ఖ్యాంచితవిలసనవిభావ ♦ నావహనగశా
ఖాంచలవిహారద్విహగవి, పంచీపంచీకృతిప్ర ♦ వృత్తి నరయుచున్. ౨౬౮

క॥ సుగ్రీవుఁ డాగ్రీవం బను, నాగ్రీవ మెడల న్వసించు ♦ త్కర్ముండై తా
నగ్రిమస్మృతి వివరింపఁగ, నాగ్రీవాపతితేజుఁ డట్టు ♦ లరిగె మృగాక్షీ! ౨౬౯

క॥ కొండొకెడను వృక్షషండా, ఖండితవనమండలమ్ము ♦ గాంచి నవీనా
ఖండలుఁడు రాముఁ డిట్లనె, మెండగు కౌతూహలమున ♦ మేనాతన యా! ౨౭౦

తే॥ గగనవీధికిఁ దోలుకారు♦మొగిలువోలెఁ, జాలి యున్నది యియ్యది♦ సరసితలమున
కొప్పు గూర్పంగఁ గదళీప్ర♦యుక్తయుక్త సాంద్రచంద్రకితాగమ♦షండమగుచు.

క॥ దీని తెఱం గెఱిఁగింపు మ, దీనప్రతిభాసఖా! మ ♦ దిం దెలిపి యనం
గానవమున నడ దనరెం, గా నని రఘువరుఁడు మెచ్చఁ ♦ గా నవఘనశిఖీ.

—♦ సప్తఋష్యాశ్రమము ♦—

తే॥ అనఘ! సురరాజమందిరో ♦ ద్యాన మల్ల
ననుచు నాశ్రమ మిది శ్రీమ ♦ దాసనంబు
స్వాదుఫలమూలరసనార ♦ సంశ్రయంబు
కుసుమసుకుమారతరులతా ♦ గుంభితంబు. ౨౭౩

ఆ॥ సప్తసప్తినిభులు ♦ సప్తజనాఖ్యులు, సప్తసంఖ్యఁ దనరు ♦ సన్మునులు ప్ర
సక్తి సప్తవర్ష ♦ శతములు వ్రతనిష్ఠ, నలిపి రిందు రామ ♦ చంద్ర! వింటె.

ఆ॥ ఏడునాళ్ల కొకట ♦ నింత గాలి భుజింత్రు, గాంత్రు నీట నుండఁ ♦ గాఁ బ్రశస్తిఁ
దలఁగ కుందు రెపుడుఁ ♦ దలక్రిందుగ వనాధి, వానవియతి వారు ♦ ధీపమేత!

క॥ సశరీరస్వర్గమన, మ్మొ శశిప్రతిభాసియశులు ♦ మొనసిరి వారల్
విశదమవుఁ దత్ప్రభావా, తిశయం బిప్పటికి సంప్ర ♦ శీతవికాసా! ౨౭౬

ఉ॥ పట్టనికోట ప్రై తరుల ♦ వేశితసంవృతి గట్టిసేయు ము
న్నట్టులె యుండు నేఁటికి సు ♦ రాసురకోటుల కప్రధృష్యమై
నెట్టన నిందుఁ జొచ్చి వెలి ♦ నెక్కొనఁ బోవ దొకండు జంతు వే
పట్టున మూఁడు వహ్నులును ♦ భాసిలు ధూమము మిన్ను ముట్టఁగన్. ౨౪౭

ఆ॥ దివ్యగంధ మెక్కు ♦ తెఱఁగునఁ బొసఁగుచు
నుండు భూషణముల ♦ నొలయు ధ్వనులుఁ
దోఁచు సాత్త్వరములు ♦ తూర్యనిస్వనములు
మధురమధురములుగ ♦ మలయు నెపుడు. ౨౪౮

క॥ వందన మొనరింపుము శ్రిత, మందార! ప్రపత్తి మాని ♦ మండలి నెడఁదన్
బొందించి యిప్పాలమునకు, సందర్శం బొప్ప ననుజ♦సహితుఁడ వగుచున్.

ఆ॥ ఏశరీరధారు♦లేని నిం దమ్మహి, తాత్ములకు నమస్య♦లాచరించు
వారొ వార లెనయఁ♦బోరు దొసంగుల, నఖిలసిద్ధిపదము♦లందఁగలరు. ౨౫౦

తే॥ అనుచు రవిజుఁ డెఱింగించు ♦ నాత్మణంబె
సానుజుం డయి తత్త్వన ♦ క్షాత్ముఁ డగుచు
నత్తపోధనులకు మ్రొక్కి ♦ హర్షకలనఁ
దనరె శ్రీరాముఁ డత్తఱిఁ ♦ దరళనయన ! ౨౫౧

క॥ అన స్తజనాశ్రమ మటు, లానంభృతయశులు గడచి♦యవ్వలఁ జని స
త్ప్రాసాదమహిత కిష్కిం, ధాసంజ్ఞక వాలిపాలి♦తం గనిరి పురిన్. ౨౫౨

క॥ వాలిదెసం గుపితుండై, వాలిన మగఁటిమిఁ బ్లవంగ♦వరుఁ డిట్లని నా
స్ఫాలన మొనర్చి యుబ్బుచు, శ్రీలలితము రఘుపృథుకముఁ♦జేరి జితారీ!

సీ॥ హరివాగురావ్యాప్త♦యదె కంటె తత్ప్రకాం, చనతోరణాంచిత♦ఘనపతాక
దృఢబహుయంత్రాఢ్య♦దీపితమణిరత్న, వైద్యుతకలనావప్ర♦వర్ధమాన
వాలిపాలిత యగు♦వరపురి రిపుఁ డందు, వఱలుచునున్నాఁడు♦వానిఁ జెనయ
రారు సురాసురు♦లాప్రియిడి వెట్టెదు, నొడ్ల నీతఁడు వర♦మోజఁ బెనుప

దేవ ! నీవప్రతిష్ఠఁ ♦ దీర్పఁ బూనుము తఱి
యిదియ తడయ వలవ ♦ దింక ననిన
రవితమాజుతోడ ♦ రాఘవేంద్రుఁడు వల్కె
నుత్సహానము నెఱియ ♦ నుల్లసిల్ల. ౨౫౪

చ॥ పిలువుము వైరి నిద్దె నెడ ♦ పెట్టక పేర్కొని యాతఁ డల్కమైఁ
గలవర మందు మున్ను నతి ♦ కాక రణప్రియుఁ డుద్ధతుండు నీ
పలుకు సహింపఁ డంగ ల ♦ పజ్జను యుక్కునఁ జటాలునం జలం
బలయఁగ వచ్చు నిక్కమిదు ♦ కే నది గాంచి మదం బడంచెదన్. ౧౮౫

క॥ నాదృష్టిపథమునం బడి, యాదట మఱలంగఁబోవఁ♦ నంతిపురికి వాఁ
డే వెసఁ బోరయక మనిన, న్నా దర్పము నగుదుగాక♦నలినాప్తసుతా ౧౮౬

తే॥ హానరుపడియుంటి పీగఁ ♦ వృష్టికతన
ని న్నదిరఁ గాంచి కర్షమ్ము ♦ నెఱి ఫలింపఁ
జేయుదుఁ బొసంగు తఱి మేలి ♦ చేన విడిన
యమ్మొలక పైరు పర్జన్యు ♦ నట్లువోలె. ౧౮౭

చ॥ అని రఘురాముఁ డుత్సహాన ♦ మందఁ బొసర్చిన నుల్లసిల్లె యా
య్యినతనయుండు తేజము న ♦ మితముగా నలలం దనర్చు న
బ్ధినిఁ ద్వరగర్జల న్మొగిలుఁ జే ♦ రొక్కనఁ జేయుచు నైరిఁ జేరె న
య్యనువున రోదసీకుహర ♦ మాగున్ఁ శ్రీయుతోనాఁగ నుద్ధతిన్. ౧౮౮

తే॥ రాజవిప్లవమున నిల్వ ♦ రాక తెరలు
కులసతుల యట్టు లాలు ది ♦ క్కుల భ్రమించె
గతరథాశ్వంబు లట్లు మె ♦ కములు వఱచె
లుప్తపుణ్యులగతిని ఖ ♦ గ్గులు లిలఁ బడియె. ౧౮౯

ఆ॥ అంతిపురి సుఖాప్తి♦నలరువాఁ డచ్చోని, కూర్మిరనాద మరసి♦కుపితుఁ డగుచు
నెగువఁ జూడఁ దార♦మగని సాహస మెంచి, యిట్టు లనియె విదిత♦మెఱుకపడఁగ.

—♦ తార వాలిని యుద్ధమునకు పోవల దనుట. ♦—

సీ॥ అలుక పీనుముభుక్త♦మగు ప్రజంబునుఁబోలెఁ, గర్జ మెంచుము తొంటి♦గతిఁ దలంపఁ
బోకుము పెన్ప్రాపు ♦ లే కీతఁ డిప్పటి, కిప్పుడె తొడరంగ ♦ నెట్లు వచ్చు
జర్ఝరితాంగుఁడై ♦ శాంతి వాయకమున్న, పిలుచుచునున్నాడు ♦ పేరుపెట్టి
తలఁకులేమియు మేటి ♦ దర్పమ్ము నెఱికల్మి, పింతలై బీరమ్ము ♦ విధ మెఱుంగఁ

జేయుచున్నవి కావునఁ♦జెనయవలవ. దొనరుపడఁ గూర్చుకొనుటయు నొప్పు నేల
దీర్ఘవైరమ్ము కాలమ్ము♦దేశ మెంచి, మమ్ము మనుపుము నాథ♦నమ్మతపుడు నెఱయ

క॥ ఏతావన్మాత్రుండే, నీతమ్ముఁడు బలువు గలఁడు ♦ నెఱిఁ జాలినవాఁ
డీతఁడెఁ దొడరుచునున్నా, డాతతబలుఁ డొకఁడు సాయ♦మై యొనయంగన్.

ద॥ అని యాఁగిన వీరుఁడ నై, యనికిం బిలువంగఁ బోవ ♦ నట్టి తలఁగు మీ
వని కడవఁజూడ నెట్టన, ననితరనయ తార యిట్టు♦లనె మెలపొలయన్. ౨౯౩

సీ॥ వానరేశ! విను నాదు♦పలు కంగదుఁడు చెల్పె, నింటి దాశరథి ప్రవీణుఁ డర్ప్రఁ
దితిఁ డయోధ్యాధిపుఁడం(డ్రి♦యనుపఁ దమ్ముఁడుఁదాను, జను దెంచి కానన♦మ్మునవసించి
దుష్టనిగ్రహమును ♦ శిష్టపాలనమునుఁ, బొనరింప నమ్మేటి ♦ పోలు పెఱింగి
యాగామిఁ గొలిచె నీ♦యనుజన్ముఁ డన్నెఱీ, నగ్నిసాక్షిక మయి♦యమరె సఖ్య
మమ్మహాత్ముఁ డొసఁగె ♦ నభయమ్ము నీవెత, క్రీర్తి మేలి సిరికిఁ♦గూర్తు ననుచు
దానఁ జేసి యిట్లు♦తెఱుముచున్నాఁడు. తనదు రాణ వెలయఁ♦దపనసుతుఁడు.

క॥ రక్కసుఁ డెడయించిన తన, మక్కువగల జనము జాడ♦మలయ నితఁడు నీ
చక్కటి పగఁ దీర్ప నతఁడు, నక్కరణిం బ్రతిన దెలిపి ♦ రని నే వింటిన్. ౨౯౫

చ॥ పరబలముం జెరల్పఁ దన ♦ పక్షముఁ గాచికొనంగ నాగుణా
కరుఁడు సమర్థుఁ డాశ్రితసు ♦ కల్పక మాపదుపేత తారకుం
డరిగణభీముఁ డారఘుకు ♦ లాగ్రణి రాముఁడు దోడుగా సురా
సురులకు శక్యమే తపన ♦ సూతి నెదిర్చి రణం బొనర్పఁగన్. ౨౯౬

మ॥ తొడరంజూడకు మమ్మహాత్ము స్వక మా ♦ దోర్దర్పము న్నమ్మి యే
మొడనేని న్దనసాహసిక్యమున మే ♦ లెంచంగ నా నెట్టు లి
ప్పుడమిం గావ జనించినాఁడు హరి యీ ♦ పొంపొప్పఁగా నంచు నే
ర్పడ నూహించి తలంగు మయ్య నఘునిం ♦ ప్రార్థింపు మిష్టార్థివై. ౨౯౭

తే॥ నీదుపౌరుష మరయని ♦ నెఱియ కాదు
తొడరి నినుఁ దూలపుచ్చెడు ♦ దొసఁగు గాదు
కోపగింపకు మోనాథ! కోసలేంద్రు
రాము నెదిరించి యిల మన ♦ రాదు సుమ్ము. ౨౯౮

క॥ వైర ముడిగి సీతమ్ముని, సారబలుని యౌవరాజ్య ♦ సంపద కభిషే
కారూఢిఁ గూర్పు మియ్యది, నేర దనక నాదు పలుకు ♦ నెఱిగను మధిపా!

క॥ శరణార్థిసులభుఁ డారఘు, వరుఁ బ్రార్థింపుము సుఖైక ♦ వశ్యుఁడ వగు మీ
వెరపున ననుసుతుఁ గులముం, బరిరక్షణముం బొనర్చి ♦ పాలింపు మిలన్. 300

తే॥ అనుచు సాశ్రునయన ♦ యై యంఘ్రిలం బడి
యొత్తి వేఁడ నాతఁ ♦ డువిదఁ గ్రుచ్చి
యెత్తి యూరడించె ♦ యిట్లనెఁ గాలక
ర్మములు తనదు తెలివి ♦ మఱువు పఱుప. 30౧

చెప్పునఁ గూర్చినో తెలియు ♦ దేవునకే యది వాలి వక్షమం
దప్పుడె క్రొత్తఁగాఁ గలి ♦ శాహతి శైలము వోలె వ్రాఁ డటన్. ౩౧౫

ఆ రాముఁ డైంద్రిబాణ ♦ రాజంబునన మొందిరిఁ
బుడమిఁ ద్రోఁచి యంత ♦ బోధసేసెఁ
గారణంబుఁ గదిసి ♦ కాని యడంగదు
కార్యవస్తు వనుచుఁ ♦ కంజనేత్రి! ౩౧౬

ఆ॥ కదలెఁ గడలు బాణ♦గతికి విమానాళి, మిడిసిపడె నతండు♦మిట్టిపడఁగ
వడఁకెఁ బుడమి వాఁడు♦వ్రాలంగ ఘూర్ణిల్లె, సద్రిగుహలు నాతఁ♦డఱవఁ దెఱవ

సీ॥ మేఘకాలము క్రిఱ♦మేదినీతలమునఁ, బఱచిన గోత్రభి♦ద్ధ్వజ మనఁగఁ
బున్నెంబు పొలివోవఁ♦బుడమిపై వ్రాలంగ, నైన యయాతిభూ♦జాని యనఁగఁ
గల్పావసానని♦ర్గతికత్వమున నేలఁ, బడిన యాదిత్యబిం♦బం బనంగ
దక్షరోషంబునఁ♦దవిలి భదుర్రం జేయ, మేను వైచిన యజ్ఞ♦మృగ మనంగ

నడచి విశ్రాంతిఁ గనిన దా ♦ వాగ్ని యనఁగ
నమ్మహాసత్త్వుఁ డెడలియు ♦ నలఁతిపడక
విస్మయ మొనర్చె నారఘు ♦ వీరులకును
నరవి వీక్షించు నంబర ♦ చారులకును. ౩౧౭

ఆ॥ శరము పుంఖ మెనసి♦స్వర్ణపుష్కరమాల, యింపొరిదత్త మెఱుఁగు♦లీనుచుండఁ
దత్ప్రసక్తిఁ బ్రాణ♦ధారి యై యతఁ డుండె, మేనికాంతితోడ♦మించుఁబోఁడి!

క॥ సంధ్యాపయోద మట్టు ల, వంధ్యపరాక్రముఁ డతండు♦వ్రాలినచో నై
ర్గంధ్యమ్ము పొదలఁ గపిలో, కాంధ్యము చూపట్టె ననఁగ♦నయ్యెఁ బ్రియసఖి!

తే॥ ఒక ముహూర్తమ్ము మైకమ్ము ♦ నొంది తెలిసి
దెసలు పరికించి కొండొక్క ♦ దెసకు మరలఁ
దనదు సుకృతమ్ము తఱి వేచి ♦ తారసిల్లి
రూప మొందిన తెఱఁగు ని ♦ రూపణముగ. ౩౧౮

—♦ వాలి శ్రీరాము నెగ్గు లాడుట. ♦—

సీ॥ వలచేతి తూఁపు డా♦వలిచేతి కార్ముకం, బరిదురాసదుఁ డితఁ♦డంచుఁ దెలుప
వల్కలాజినముల♦వరుస జటాచ్ఛట, లాశ్రితావనదీక్ష♦ననువదింప
మిఱుమిట్లు గొలుపుచు♦మితిమీఱు తేజమ్ము, నిఖిలాతిశాయిత♦నిర్ణయింపఁ
గారుణ్యరస మొలుక♦కల్యాణదృష్టు లం, య్యనజానుజుల వంక♦నిరవుకొనఁగ

లలితదూర్వాదళశ్యామ ♦ లంబు మేని
మస్రిదిమ నిజవనమాలాను ♦ మాపకముగ
నున్నతి మురమ్ము దీర్ఘబా ♦ హువులుఁ గలుగు
నమ్మహాపూరుషుఁడు చూచ్చె ♦ కన్నె గిరిజ! ౩౧౯

క॥ నివ్వెఱపడియును నవ్వగ, దవ్వరయఁగనీని కష్ట♦దశలఁ జేష్పడి తా
నవ్వేలనున ధృతిసెడ నతిఁ, డవ్వనజాతాక్షుఁ గాంచి♦యనె నిట్లు సఖి! ౩౨౦

మ॥ తగునే నీ కిది మానవాన్వయము శు ♦ ద్దం బందు జన్మించి మే
లగు క్షాత్రంబున మించి కొండొకనితో ♦ నాయోధనాసక్తి నుం
డఁగఁ జాటొంది మొఱంగి వేఁచి యిటు క ♦ ట్టా తీవ్రబాణంబునన్
బగ సాధింపఁగ నేమి నేర మిచటం ♦ బాటించితో నాకువా! ౩౨౧

ఆ॥ క్రోతిఁ జంప నీకుఁ♦గోరిక బొడమిన, నని యొఘత్తు న్యు నుగుట♦వ్యర్థ మయ్యె
వ్యాధధర్మ మేని♦వఱల దన్యాసక్త, మైన మెకము నేసి♦నంతె రామ! ౩౨౨

క॥ నమ్మితి ధర్మిష్ఠుఁడ వని, యమ్మెయిఁ గాకున్నఁ బోలుతె♦నారసి నిన్నే
రెమ్ముకొనఁ జూచి యాతని, ది మ్మవ్వల నెడలఁజేయు♦తెరు వెడయుమనే.

క॥ ఎదురుపడి న న్నదల్చినఁ, గుదు రగు నీపౌరుషంబు♦గూర్చిన వెర వ
య్యదనున నే మయ్యెడినో, విదితం బగు లోకమునకు♦విస్పష్టముగన్. ౩౨౪

క॥ నాచేసినయపకారం, బేచతురతఁ గాంచఁగంటి♦వినతనుజాం డ
ప్తేచాయఁ జేసె నుపకృతి, దాచిన ఫల మేమి చెపుము♦దశరథతనయా! ౩౨౫

ఆ॥ ఎంత కాల మేలె ♦ నిల నాతఁ డెమ్మెయి, మే లొనర్చెఁ బ్రజలు♦ మెకొనంగ
నట్టి ధర్మమూర్తి♦కనఘున కేళంగిఁ, బొడమితో కొ ప్రథితి♦సెడఁగ రామ!

ఆ॥ రావణుఁడు హరించె ♦ రాణివానం బని, తగినవాని నేర్చి ♦ తార్చికొంటి
వితని సాయ మేల ♦ యే నైన నవ్వానిఁ, బురిని సీతఁ దెచ్చి ♦ పొంత నిడనె.

క॥ అద్దుష్టుఁ గెడపి పావని, సద్దేవి సితాశ్వతరిని ♦ నజునకు హరియ
ట్లద్దిర యొన నర్పింపనె, కొద్దిపడితి వేల దీని ♦ కొఱ కినవంశ్యా! ౩౨౮

ఉ॥ నీచపుఁ గృత్య మం చనక ♦ నీ వొనరించితి కాని దీన నీ
కేచతురత్వ మేర్పడియె ♦ నిందును నందును దుర్యశంబ కా
కాచపలుండవు ని న్నెరసి ♦ వందులకు న్ఫల మేమి కల్గునో
తోఁచనె యెంత మోసమును ♦ దోసము నొందితి వాజినందనా! ౩౨౯

తే॥ అనుచు నీరీతి భాషించు నా ♦ య్యింద్రిసుతుఁ గాంచి
పలికె సత్యవాది రాముండు ♦ ప్రౌఢి వెలయ
నెదిరివంకల దిట్టంగ ♦ నెఱిఁగి త్రైవఁ
దనము తప్పఁ బరయుచున్న ♦ ధన్యుఁ డగునె. ౩౩౦

—♦ రాముఁడు వాలిమాటలకు సమాధానము చెప్పుట ♦—

క॥ పెద్దల సంసేవింపక, తిద్దయు ధర్మమ్ము సరణి ♦ దాఁకొని కటు లీ
వృద్ధవిడి మాటలాడినఁ, గద్దా ఫల మింతవట్టు ♦ గానవు వింటే. ౩౩౧

శా॥ ఏమీ సోదరుఁ డోలి వాని వనితా ♦ నిల్లాలి నల్లాడఁగాఁ
గామిత్వంబున బల్మిఁ గొంటి వన ని ♦ న్నాదే వధింపంగ నీ
వే మానింపుము బిడ్డ శోడు స్నుష య ♦ క్కై బిమ్మ పుణ్బోఁడియుక్
గా మర్యాద చెడంగఁ దోఁచి మను నా ♦ కష్టు న్ఘను ల్మెత్తురే. ౩౩౨

మ॥ చెడుఁగుంగర్జముల న్బొనర్పఁ గనుచు ♦ న్శ్రేయంబు లక్షించుచున్
గడుదర్పించు శతుండు తత్ఫలముగాఁ ♦ గష్టంబు ప్రాప్తింప నె
న్నఁడు స్వీయ మ్మగు దోస మన్యులదె య ♦ న్యాయం బను న్దైవునిన్
దొడరుం దిట్టఁగ నంతమాత్రమున నే ♦ దుష్టత్వముం దోఁయునే. ౩౩౩

ఉ॥ తప్పు లొనర్చువారు నృప ♦ దండ్యులు దండితు లైన వెంటనే
ముప్పుల నొందకే సుకృత ♦ ముం బొనరించినవారి యట్లు దా
రొప్పుదు రుత్తమస్థితికి ♦ నోడరు లోకభయావహంబ యౌ
నప్పతి పాశబంధమున ♦ కామరసంస్తుతులందఁ గాంచుచున్. ౩౩౪

క॥ భరతుని శాసన మిప్పుడు, ధరఁ జెల్లెడు దానిఁ బూని ♦ తాత్పర్యమునన్
జరియింతు మేము దుష్టులఁ, బొరిగొందు మభిన్న మైన ♦ బుద్ధి వాకిందాం! ౩౩౫

ఉ॥ ఏ నిటు వేషధారి నయి ♦ యింతట నంతట సంచరింతు ధ
ర్మానుగుణోపపన్న మగు ♦ నర్థము మున్కొని శిష్టరక్షణం
బేని నశిష్టశిక్షణము ♦ నేనియుఁ జేయుదు దైన్యయుక్తులే
మానితు లట్లు దర్పితులు ♦ మాకు విరోధులు శక్రినందనా! ౩౩౬

ఆ॥ ఏఁ బ్రతిజ్ఞ నేసి ♦ యిట్టట్టు లొనరింప, నంతమాత్ర మనఁగ♦ నగుదు నెట్లు
వేఁటకాఁడు పొంచి ♦ వ్రేయఁడే మెకముల, ధర్మపాలనమ్ము♦తగదె వతికి.

ఆ॥ మెకము పాటి గాక♦మేకొన్న వరశక్తి, నొడ్డ చెఱువు గోరి♦యున్న నిన్ను
మొఱఁగి కూల్చితిని న♦మోఘమ్ము దేవతా, గౌరవ మ్మడల్పఁ♦గామి నిట్లు.

క॥ వానిపాటఁ గలుగు ప్రేముడి, మేనిపయిం గాని సగము♦మేనిపయిన నే
నాని తనకుఁ బొసఁగదు నీ, వానిం బొనరించి యింక ♦ వదలుము రక్తిన్. ౪౯

క॥ వందన మొనరించెద శ్రీ, మందార! సమస్తలోక♦మాన్యచరిత! సం
క్రందననందిత యభయా, నందప్రద భవ్యమూర్తి♦నలినాక్ష! హరీ! ౩౫౦

చ॥ అని ప్రార్థించి సరోరుహాక్షసుతు నె♦య్యం బొప్పఁగాఁ జేరఁ బి
ల్చి నయంబొప్పఁ జరింపు మీహరికృపన్ ♦ శ్రీగంటి వర్థిష్ణుతన్
జనిరా వేల్పులు మన్నిపాళ్యవధిగాఁ ♦ జాటింపుమా వైరమున్
గను మాత్మీయులఁ గాంచు మోద మెసఁగం ♦ గా సర్వసౌఖ్యంబులన్. ౩౫౧

తే॥ తార నయవేత్రి యద్దాని ♦ తలఁ పెఱింగి
నీవు వర్తిల్లు మద్దాన ♦ నెరయు భద్రి
మంగదుఁడు నీకు నాకును ♦ నతఁడె సుతుఁడు
వాఁడు నీయాన మీఱెడు ♦ వాఁడు గాఁడు. ౩౫౨

క॥ ఆయుష్మంతుఁడ వగు మం, చాయింద్రవితీర్ణ మైన♦యధిసౌవర్ణ
ప్రాయము శ్రీయజమాల్యం, బాయదనున నాతఁ డతని♦కర్పణ సేసెన్. ౩౫౩

ఉ॥ ఆదట రాముఁ గన్గొని గు ♦ ణాకర! శ్రీకర! రామచంద్ర! యి
వ్వేదనఁ బాపవే శరము ♦ వేగ వెలార్చి త్వదీయపాణి యో
గోదితసంప్రసాదనము ♦ హేయాన్నతి నెక్కొనఁ ద్వత్పదమ్ము సం
మోదము మీఱఁ గాంతు భవ ♦ మోహనిరాకరణమ్ము పొల్పడన్. ౩౫౪

—♦ శ్రీరాముఁడు వాలి యిష్టంబుల నొసఁగుట. ♦—

ఆ॥ అనిన నందువాఁడ♦వత్యతిశయితము, పుణ్యలోకసుఖము♦పూజితుండ
వగుచు నిందు గొఱతఁ♦లని లేవు ప్రతిరూపుఁ, డంగదుండు ప్రాభ♦వాప్తి నెగడు.
క॥ నీవలనిగౌరవం బెట్టు, లీవఱ కతఁ డందుచుండె♦నినజునివలన
న్నావలన నట్టిమన్నన, లేవేళం గాంచు దీని ♦ కెఱియకు మెదలోన్. ౩౫౫

ఆ॥ అనుచు రాముఁ డుభయ ♦ మా శల్య మెడలింప
నైంద్రి మేను బాసి ♦ యింద్రరూప
మంది శని విముక్తి ♦ హరికరస్పర్శన
చ్ఛిన్నబంధుఁ డగుచు ♦ స్త్రీలలామ! ౩౫౬

ఆ॥ రామబాణనిహతి♦రణరంగమున వాలి, గూలినంతఁ గపులు♦దూలి తార
కెఱుక సేసి రెయిది యిద♦మిత్థ మని కార్య♦ భంగితోడఁ గూడఁ♦బద్మనయన.

ఆ॥ పట్టిపైని ప్రేమ♦పలుకఁజాలెనె వానిఁ, నేమిసేయఁ దలఁచి ♦ తింతవట్టి
నాయదృష్టి నైన♦నాయమే యాతనిఁ, గన్ను లెత్తి కాంచ♦గాన కునికి. ౩౧౯

ఆ॥ యూథపతిఁ బాసి దేజులై♦యున్న యాక, కేణుకల భాతి నెగడరా♦నీతి నీదు
ప్రీతిఁ గాంచిన సుందరు♦ల్పిలిచి పీని, గారవింపంగ రాదె స్వ♦ర్గతమె సతమె.

తే॥ పీరచందనమున తావి ♦ విరులుకొనఁగ
నెగడు నెఱజాణ విస్లేల ♦ నేలఁ బొరలి
ధూళి వొరయంగ రక్తంబు ♦ దొరుగ నుంటి
వలఁతిగా నెంచి యింక నీ ♦ యువులు నగరె. ౩౨౧

క॥ క్షీణుఁడ వని నిన్నెడపె న, ధీర న్ననుఁ దలఁపరాదె♦దేవున కేనిన్
గారణము పక్షపాతమె, నేరం బననేల యంత♦నియతులు గలరే. ౩౨౨

మ॥ అని దిక్కుల్పరికించి కాంచె జలద ♦ శ్యాము న్మహాబాహుఁ బా
వననామున్ సుగుణాభిరాము వృతభా ♦ స్వద్ధాము శృంగారధా
ము నసత్యేతరకాము శ్రీవిజితకా ♦ ము న్సజ్జనస్వాశ్రితా
వనకాము న్మఖలక్ష్యసోము ధృతి ♦ దీవ్యద్భాము శ్రీరామునిన్. ౩౨౩

క॥ రవిజానుజసహితు రఘు, ప్రవరు న్గని విస్మయోప♦పత్తి నెఱయ శో
కవిహాతతతకాతర్య, ప్రవాహనిర్మగ్న యగుచుఁ♦బలికెఁ బురంధ్రి! ౩౨౪

తే॥ స్వామి! పత్నీవియోగసం ♦ భవము దుఃఖ
మయ్యె నీ కనుభూత మ ♦ ట్లగుట భర్త
నన్నుఁ బాసి సుఖింపఁడు ♦ నాకమందు
నేని ననుఁ గూర్పఁ దలఁపు మి ♦ య్యెడరు తలఁగ. ౩౨౫

క॥ క్షితిజను నిన్నెడఁబాపిన, మతిహీనుం డరసెనే స♦మరసత్వం బ
య్యతివకు నీకును విదితం, బతిలోకుఁడ పీవ తగుదు♦వాలోచింపన్. ౩౨౬

తే॥ అన్నదమ్ముల తగవున♦యందు మేలు, గూర్చి తనుజున కన్నకుఁ♦గొఱఁతపడియె
నాశరమ్మున ననుఁ గూల్చి♦యతనిఁ జేర్ప మేలుకొను మిట్టిమేలున♦నేలుకొనుము.

క॥ స్త్రీవధ దోషము గామియు, నీ వెఱుఁగుదు భర్తృలోక♦మేఁ గాంచెదఁ బ
త్నీవిశ్రాణనపుణ్యము, తావక మగు ధరణి వెలయుఁ♦దద్దయు యశమున్. ౩౨౮

తే॥ కంటి సుగ్రీవ నేఁటి క ♦ ఘమ్ము దలఁగ
రాముకరుణావలోకమ్ము ♦ రాణ నెఱయ

రుమను గూడి సుఖింప మా ♦ సాధమైన
ప్రేమ యేనాఁటికేనియుఁ ♦ జెడవు సెమనె. ౩౪౯

కం॥ అన్నకుఁ దమ్మున కొదవిన, యన్నాఁటి విరోధ మగ్గి♦యుట్టిద యయి యా
లి న్నలసి తోడికోడం, డ్రి న్నతిగని కాల్పంగాఁ డి♦రం బయ్యెనోకో. ౩౫౦

—♦ రాముఁడు తారకు జ్ఞానోపదేశము సేయుట. ♦—

ఆ॥ అనుచు జాలు గదుఁగ ♦ నారటమున క్రీన
యగుచుఁ నేడ్చు తార ♦ ననునయించి
పలికె రాముఁ డపుడు ♦ ప్రజ్ఞావిశేషంబు
శ్రుతులఁ జెంది సత్వ ♦ శుద్ధి బెనుప. ౩౫౧

కం॥ వ్యర్థముగా నేడ్చెద వీ, వర్థం బరయకయ యిట్టు♦లగుమరె ఛేరల్
నిర్ధారణ సేయుము త్వ, త్ప్రార్థిత మది మేనొ జీవ♦పద యోగ్యంబో. ౩౫౨

శా॥ మేనే నీపతి యన్న భూతమయ మ ♦ మ్మేశమ్ము మాంసాస్థిము
ఖ్యానద్ధమ్ము జడమ్ము కాలగుణక ♦ ర్మాపాద్య మాపాతిభో
గానుస్యూతము ద్వంద్వదూషితము నే ♦ యం బద్ది నీచెంత నే
కానంగా నయి యుండె నే మనుచు నీ♦కాతర్య మజ్ఞాననా! ౩౫౩

తే॥ వనిత! జీవాత్మ నీపతి ♦ యనిన నతఁడ
నామయుఁడు పుట్టుగిట్టు లా ♦ యాతయాత
కలన లెనయఁడు స్త్రీత్వపుం ♦ స్కత్వషండ
భావములు వానిఁ బెరయవు ♦ పద్మనయన! ౩౫౪

తే॥ కాంచు మాకాశవత్సర్వ ♦ గతుఁ డలేప
కుం డశోకం డద్వితీయుండ ♦ జుండు పరుఁడు
నిత్యవిజ్ఞానసుఖమూర్తి ♦ నిర్మలాత్ముఁ
డతనికై యేడ్వ నేమగు ♦ నంబుజాక్షి! ౩౫౫

—♦ తార సందియంబులకు శ్రీరాముఁడు సమాధానము వచించుట. ♦—

ఆ॥ అనినఁ దార యిట్టు♦లనెఁ గాత్మవ జ్జడం, బంటి దేహ మీశుఁ♦డంటి జీవుఁ
డరయ సుఖము దుఃఖ♦మాది యగా సంసార, బంధ మెవని దెలుక♦పలుపుమయ్య

కం॥ అనినన్ శ్రీరాముం డి, ట్లనె నా మెతిఁగించు తత్త్వ♦మరయుము దానన్
బనపడు సందేహావినో, దన మది బంధచ్ఛిదం బు♦దారమనీషా! ౩౫౬

తే॥ ఎంతవఱ కహ మని మమ ♦ యనియుఁ దనువు
నింద్రియార్థమ్ములను గాంచి ♦ యెంచుచుండు
నంతవఱ కుండు సంసార ♦ మవల నెడయు
దాని కాత్మవివేకమం ♦ తంబు గాన. ౩౮౮

ఆ॥ స్వప్నమందుఁ దోఁచు♦సర్వార్థజాలంబు, మిథ్య యయ్యెఁ దెలివి♦మేల్కొనంగ
నెట్టు లట్టు లెఱుఁగు♦మీ సత్యసంసార, మాత్మదృష్టి మిథ్య♦యగు నటంచు.

ఆ॥ తన కనాద్యవిద్య♦తజ్జ యహంకృతి, కారణములు గాఁగఁ♦గలుగఁ జేయుఁ
బ్రాంధి పై మనమ్మొ♦రాగవిద్వేషాది, సంకులమ్ము మాయ♦సంసరణము. ౩౯౦

తే॥ ఆత్మసాన్నిధ్యమునఁ దన ♦ యందుఁ గలుగు
దోషముల నెల్ల నతనిపైఁ ♦ ద్రోయుచుండుఁ
జేతనత్వం బతనిసక్తిఁ ♦ జేసి కాంచు
నింక నెంతెంతలకుఁ జాల ♦ దిమ్మనమ్ము. ౩౯౧

క। ఇదె బంధం బిదె మోక్షం, బిదె సుమ్మఖిలేంద్రజాల♦మిదె త్రైలోక్యం
బిది గాని దొండు గలదే, మదిలో నూహింపు మింక♦మహితవిచారా! ౩౯౨

తే॥ ఆత్మఁ దనయంతవానిఁ జే ♦ యంగ శుద్ధుఁ
డయ్యు స్ఫటిక మలక్తాది ♦ కానుస్మృతి వి
రక్త మైనట్లు దాను వి ♦ రక్తి వంక
బోషిఁ దద్రూపమున ♦ నుండుఁ బోలుపుదక్కి. ౩౯౩

క॥ కలితామదోషగుణసం, కలితుండై జీవసంజ్ఞఁ♦గని జన్మజరా
దుల సుఖదుఃఖప్రత్యయ, ముల స్వప్నాదులనుఁ గాంచు♦మూఢుం డగుచున్.

ఆ॥ మూఁడు గోనము లంది♦మూఁడు వర్ణంబుల, కర్మములు గడించి♦గతులఁ దత్స
మానములన తదభి♦మానమ్మునం గాంచు, నవశుఁ డగుచు జీవుఁ♦డబ్జవదన!

తే॥ భూతసంవృతమా ♦ నంత ప్రొద్దు సంభ్ర
మించును లయించు మఱల ని ♦ ర్మితిసమయము
గా మనోవాసనలతోడఁ ♦ గానుపించు
నతఁడు ఘటయంత్రి మట్టిఁడై ♦ యాలఘుచరిత! ౩౯౬

సీ॥ పున్నెంపుఁజేతల♦పొడవున మద్భక్తు, లతిశాంతు లగువారి♦నందఁగాంచుఁ
గాంచి యవ్వారి సం♦గతి సద్విషయముగఁ, జిత్తప్రబోధమ్ము♦సేయ నెంచు

నెంచి దుర్లభయు సం♦మంచితయును నైన, మర్త్యశరీరవాస♦మరసి జొచ్చుఁ
జొచ్చి యాత్మానాత్మ♦వస్తుల విచారించి, నధ్యాత్మదుఃఖయోగ♦మలవఱచు
నలవరించి యద్దాని చే♦నధిగమించు, నంచు స్వగురూక్తవాక్యప్రమా♦ణ చితార్థ
విదితమున ముక్తుఁడై బ్రహ్మ♦పదవిలాసమంగనామణి నావాక్య♦ల నెఱిఁగి నేనుము

క॥ నాఁడోడినిన యాత్ముండు, బానందాత్మస్వరూప♦మగుచును మనుచుఁ
న్నానుభవాప్తి నెవఁడు తెలి. లో నెందు నతఁడు ముక్తి♦లోఁగాను సుగుణా!

క॥ మే నింద్రియము లహంకృతి, నే ననక సాక్షిరూప♦మెంచుము నీవ
జ్ఞానజము బంధ మెడలి సు, జ్ఞానాననస్థితి భజింతు♦వంతము సుగతిన్. ౩౯౯

తే॥ నీవు తొలిజన్మమున భక్తి♦నియతిఁ గొలిచి, తల్లు గాన నిమ్మెయిఁ గాన♦నైతి నన్నుఁ
దలఁపు మెద మత్పదం బందఁ♦గలవు శోక, మోహావిచిభవాబ్ధిని♦ముక్త వగుచు.

*క॥ దేవేంద్రపదము దొరకిన, నీవిద్య త్వాలయు సౌఖ్య♦మెనయుఁ గలదె నీ
భావము మన్మయ మగు నెఱి, భామిని! భావ్యకము తెల్లఁ♦బడ నెఱవు గతే. ౪౦౧

క॥ అని హరి కరుణామయుఁడు, ట్లనితరసులభ మగు భంగి♦నాడిన మృదుల
వ్వనితామణి విని విస్మయ, మునఁ బొడలుచుఁ దత్పదాబ్జ♦ముల కెఱఁగె ధృతిన్.

తే॥ ఆమె దేహాభిమానజం♦బయిన శోక
మెడలి యాత్మానుభవతృప్తి♦నెనయఁ గాంచి
యఘము బాసి జీవన్ముక్త♦యయ్యె నప్పు డె
రాము నుపదేశమున నగ♦రాజతనయ! ౪౦౩

క॥ వావిడిచి వగచె నటు సు, గ్రీవుఁడును వోలుతఁ దనదు♦కీడెంచి యతం
డావగ వీడెను రాముని, శ్రీవిలసితవాక్ప్రసక్తిఁ♦జిన్మయమూర్తీ! ౪౦౪

తే॥ రఘువరుం డిట్టు లనె నప్డు♦రవిజుఁ గాంచి
యార్థవైదైహికకృత్య మ♦త్యంతభక్తి
నెఱపు మంగదుఁ దోడ్కొని♦నెగడుగనిన
వాఁడు నీయన్న సద్గతి♦వడయవలయు. ౪౦౫

ఆ॥ బాంధవప్రియుక్త♦బంధమ్ము వీడంగ, నమ్మహాధ్వరమ్ము♦నాచరించి
శుద్ధు లగుచు రాము♦శుభవర్తనంబున, మెలఁగువార లవల♦మే లెఱిఁగి. ౪౦౬

మ॥ అనిన న్వల్లె యటంచు భక్తిమెయి న♦య్యర్థమ్ముఁ గైకొంచుఁ జ
య్యన మంత్రుల్నిజబాంధవు ల్మానసిరా♦నయ్యేంద్రి మే నుజ్వ్వలం

బు నమూల్యంబును నైన పుష్పకమునం ♦ బొందించి వందిస్తుతు
ల్వానర న్వాప్యము లోలి మోఁయు విభవ♦స్ఫూర్తిప్రయుక్తంబుగన్. ౪౦౭

ఆ॥ పుత్త్రుఁ డంగదుండు♦పాలుపారు భక్తిఁ దం, డ్రికై తనర్చు♦తెలివి మెలఁగ
నతనితోడిపాఁడె♦యగుచు నర్కజుఁ డేగ, భ్రాత సంస్కరింపఁ♦బ్రథితి వె యు.

క॥ తారాప్రముఖస్త్రీణము. దారస్థితి వెంటరాఁగ♦దత్తదుచితస
త్కారము లొప్ప విధిసమా, చారమునం జరిపె రెల్ల♦సంస్కారములన్. ౪౦౯

తే॥ అమ్మెయి నివాప విధులు స ♦ మాదరమున
నెరపి పరిశుద్ధుఁడై మహా ♦ నియతి వెలయఁ
గృత్యశేషమ్ము లొనరించి ♦ కీర్త్యమానుఁ
డతఁడు శ్రీరాముఁ జేరి యి ♦ ట్లనియె భక్తి. ౪౧౦

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు వానరరాజ్యము నప్పగించుట. ♦—

క॥ శ్రీనాయక! పాలింపుము, మానుగఁ గిష్కింధ సకల♦మాన్యుఁడ వగుచున్
మానేర్చినవను లంగదుఁ, డేనునుఁ బొనరింపఁ గోరి♦తు♦లిందఱుఁ గొలువన్.

తే॥ మాతలంచిన కర్జ మి♦మ్మంత్రులెల్ల, మే ( నిరి మేలిగొనముల♦మేలుబంతి
ప్రాంచితశ్రీ సమృద్ధికిఁ♦బట్టుగొమ్మ, యిమ్మహీయు నీకుఁ గైవసం♦బినకులీన!

క॥ నను లక్ష్మణు నొక్కఁడుగా, మనమున భావింపు మనుడు♦మామానితుఁ డి
ట్లను నీ వన నే నన నొం, డనఘా! లేదరయు మేత♦దర్థము మదిలోన్. ౪౧౩

ఆ॥ ఏలు మెల్లకపుల♦కేలికవై నీవ, యిప్పురమ్ము మొనసి♦యిత్థ రాజ్య
మేను నగరు సొరఁగ♦నెంచ ని రేదు వ, త్సరము లనిన ప్రీతిన♦చక్క నెఱప.

క॥ అంగదుని యౌవరాజ్యము, నం గూర్పుము దాన మేల్గ♦నంగాంతువు నీ
కుం గడుఁ గూర్చు మదనుఁజుఁడు, నంగాతిగ వచ్చు నీదు♦సంపద లరయన్.

తే॥ వైభవోన్నతిమై నుండి♦వానకారు, గడవ జతనం బొనర్పుము♦త్సామ్రితనూజ
తా వరసి మే లెఱింగింప♦నే వసింతు, నంతదనుకఁ బ్రవర్షణా♦ఖ్యాద్రిదరిని.

—♦ రామాజ్ఞప్తుఁడై లక్ష్మణుఁడు సుగ్రీవుని వానరరాజ్యమున నభిషేకించుట. ♦—

ఆ॥ అనిన రాముఁ బొగడి♦యభివాదన మొనర్చి, నీయనుజ్ఞ మేర♦నేఁ జరింతు
నని నలక్ష్మణుండు♦ననుగతసచివుండు, నగుచుఁ జేరెఁ బురికి♦నగకుమారి! ౪౧౭

తే॥ నగరి భూషించి నాయికా ♦ నాయకుల న
లంకరించి కుమారుఁ గ ♦ లంక దేర్చి
మాంగళికతూర్యనిస్వాన ♦ మహితముగను
నాథుమణి రత్నసింహాస ♦ నమునఁ జేర్చి. ౪౧౮

శా॥ శ్రీమంతుం బొనరించి రవ్యనచరుల్ ♦ శ్రీరామదేవాజ్ఞ నా
ద్యోమాణిక్యముసూను నైభవసము ♦ ద్యోతంబుగా రాజ్యల
క్ష్మీస్త్రమస్తైభకరోచ్ఛ్వలద్విసనము ♦ త్సేకాభిషేకంబుతో
స్వామిత్వంబున నుంచి యాశశిరవి ♦ స్థాయిత్వముం గోరుచున్. ౨౧౯

తే॥ ఎలమి నైన నంగదుని నట్టు♦లెనసి కూర్చి, శ్రీకరకుమారరాజ్యాభి♦షిక్తుఁ జేసి
రమ్యమహిమోత్సవములఁ గాంచి♦యర్థజాత, మర్థితుం డయి వీక్షించి♦నంభ్రమముగ.

క॥ రామానుజుఁ డరుదెంచిన, రాముఁ డతనిఁ గౌఁగిలించి♦రహి మించెఁ బ్రీతి
స్థామహితుఁ డగుచు హరిపతి, సేమంబునఁ దనదు జెంచి♦సిద్ధార్థుండై. ౨౨౧

క॥ విదితుఁడు రాముఁడు తో నం, గదు నభిషేకింపఁ బనిచెఁ♦గద యని కపు ల
య్యదనునఁ బొగడిరి మెచ్చిరి, త్రిదశులు రవిజుఁడు తదాన♦తిం గొని మెలఁగెన్.

తే॥ అంగనామణీ! వింటె రా♦మావనీంద్రు, చరితము నవోల్లసద్రస♦భరిత మనిన
నభవ! యవ్వాలికన్య వెలి♦కానఁ దెలుపు, మని న గాత్మజ గిరిధన్వు♦నడుగుటయును.

ఉ॥ ప్రాజ్యవిభూతిదాయక ప్ర ♦ భాకరమండలలక్ష్మహేతుతా
పూజ్యమహావిధాయక! వి ♦ భుత్వవిలాసవిశేషణాత్తసా
మ్రాజ్యకలాధినాయక! స ♦ మస్తజగత్కలితావనప్రియా
భాజ్యరమానునాయక! ప్ర ♦ భంజనజాప్యమనోనిధాయకా! ౨౨౪

క॥ ఔపయికాంచితహృద్యద, తాపత్రయవారకైక♦తత్పర మంత్రా
ధ్యాపక శ్రీపరమార్థ, ప్రాపకతావిద్యమాన♦పదసంస్మరణా! ౨౨౫

వనమయూరము.

భానుభవభావనుభవ♦భంజనరిపున్వ్య, శ్రీనయనధీనయన♦సీమమహిమాఢ్యా!
కాననచరాననచ♦కాసదుపదృష్టి, స్థానగతతానగత♦తద్విమతదార్ఢ్యా! ౨౨౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబునం
గిష్కింధాకాండంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## కిష్కింధాకాండము.

---

### ద్వితీయాశ్వాసము.

---



విలసద్యోగీశ్వర
భావశ్రీసన్నివేశ ♦ భావితనిజ త
త్త్వావిష్కరణరసాత్మక
జీవంజీవపదజీవ! ♦ చిన్మయరూపా! ౧

ఆ॥ అవధరింపు మార్య! ♦ యమ్మెయి వేఁడంగ, నిట్టు లనె మహేశుఁ ♦ డెలమి రామ
భద్రుఁ డినజుఁ బట్ట ♦ భద్రుఁ జేసి సుఖాత్ముఁ, డగుచు నాతఁ డుండు ♦ నవసరమున.

క॥ గ్రీష్మావసాన మని య, ర్చిష్మన్నిభుఁ డొదిఁగి యుండె ♦ శిఖరిగుహాం దా
నూష్మలతాంచితుఁ డయ్యు వ, పుష్మత్సామాన్యలీలఁ ♦ బుష్పసుగంధీ! ౩

సీ॥ అగ్గిరిశృంగమ్మ ♦ నంతర్గుహామె తన, కుచిత మా నావాస ♦ మోల మనుచు
మెచ్చి స్ఫాటికయుక్తి ♦ మేకొన బహురత్న, చిత్రితస్థలకలా ♦ శ్రీవిశేష
మగుచు దివ్యమ్ము వ ♦ ర్షానిలనహము స, త్ఫలపుష్పశోభాఢ్య ♦ భవ్యతరు
తాంచిత మనవద్య ♦ మతులసరోవర, ప్రాంతమ్ము ♦ మృగపక్షి ♦ భాసితమ్ము
నైన యచ్చోట ధరణిక ♦ న్యాపహర్తఁ
దవులు సమ్మది నొండిచ్చ ♦ దలఁగ నామె

గానము సేయించు ధృతిఁ దమ్ముఁ ♦ గుజ్జితోడ
రాముఁ డుండెను రాజమ ♦ రాళగమన! ౪

ఆ॥ నెలఁది వానకాఱు విరహి♦మస్సహ మని, మొఱఁగి మొఱఁగి మేల♦యినకులీనుఁ
డధివసించెనొకొ♦యాప్రస్రవణగిరి, నధిపు చిత్త మరయు♦టలఁతి యగునె. ౫

—♦ శరద్వర్ణనము. ♦—

సీ॥ విశదిమట్టు లానర్చె♦విద్యుల్లతికఁ గూడి, నల్ల చుట్టఱికమ్ము♦ననలఁ గూర్ప
నాక్రమించెను దిక్కు♦లన్నియు నెఱితోడి, గాడుపు సంగడి♦కాఁడు గాఁగఁ
గర్జిల్లె నుత్సాహ♦కలనఁ జెంపునఁ దన, సరిగా కొక్కొం క్లెను♦నన్న నెఱయఁ
గురియించె శరధారఁ♦గుంభిని యుప్పొంగి, పులకాంకురమ్ముల♦పొలుపు వెలుప

గాసిఁ బాసి కృషీవలా ♦ గనలు మేలి
కూర్మి చూడ్కులు దనపైనిఁ ♦ గ్రుమ్మరింపఁ
జాతకము లార్తి వీడంగఁ ♦ జంద్రికెత్తు
లాడఁగఁ బ్రశస్తిఁ గాంచె వ ♦ ర్షాభ్రవిభుఁడు. ౬

మ॥ తనరాక న్బరరాజహంసతతి స్వ ♦ స్థానంబులం బాసి చ
య్యన నమ్మానసభూమికై తరల సం ♦ స్త్యాయంబులం బొంది పాం
థనికాయంబు సుఖింప జీవనరమో ♦ ద్యద్దాత యీతండె పో
యని యెవ్వారును సన్నుతుల్సలుప న ♦ ర్షాధీశుఁ డొప్పెం గడున్. ౭

తే॥ ఘనుని ధాటికిఁ దమవారు ♦ కదలిచనఁగఁ
గమలినులు గాసి నొందుట ♦ గాదు తలఁపఁ
గువలయక్షేమ మిరువంకఁ ♦ గుదురుకొనుట
కన్న మే లెన్నఁడేనియుఁ ♦ గానఁబడునె. ౮

మ॥ కడిమ ల్పూచెను జాజు లుల్లసిలె శ్రీఁ ♦ గాంచెం దొవ ల్కుందళు
ల్పొడమె న్మొగ్గల తోడఁ బుట్టువులుగాఁ ♦ బుష్పించె నామూలముం
గొడిసె ల్విచ్చెను నాగకేసరములు ♦ న్గొజ్జంగి గేదంగు లా
జడివేళ న్విలసిల్లె నన్నియు ధరా ♦ చార్వంగికి న్భూషలై. ౯

తే॥ అభ్రగర్భిణి యాద్యోల ♦ తాంగి సూతి
వాతయుక్తిఁ బ్రసవవేద ♦ నాతిఖిన్న
యై పొదలఁ దోఁచు హుంకృతు ♦ లయ్యె నుఱుము
లాడలిభూషల ద్యుతులు వి ♦ ద్యుత్తు లయ్యె. ౧౦

తే॥ రోదసీగర్భశుక్తికా ♦ రూఢి నెరయు
స్వాతివృష్టివిశేషసం ♦ పాతమునను
జలముఁ జెల్లెడ నింపె ని ♦ స్తంద్రుఁ డగుచు
మౌక్తికావళి బ్రహ్మాండ ♦ మండలమున. ౧౧

వ॥ వెండియు నెల్లెడ నిండారు రసపూరం బేకరసం బై యజ్జ్యోతిస్సనాథుం డగు పర్జన్యునిమహేశ్వరత్వం బెఱింగింప వ్యక్తం బయ్యె నవ్యక్త మన నొప్పారు నద్దానం బొడకట్టు లోహితశుక్లకృష్ణంబు లను మూఁడు గుణంబుల స్ఫురణంబుల కాటపట్టు లై తనరారు కోకనదకైరవేందీవరంబుల వికాసంబు లతిభాసమానంబు లై దెసల కెక్కె యపూర్వలక్ష్మీవిశేషానుసంధానం బొనరింప నెచ్చోట నేనియుం దామ యై పించెలు విప్పి జోడుపిట్టల చిత్తంబు లనువర్తింప నర్తించు నాటపులుంగుల మెలుంగు లైంద్రజాలికవిడంబనలం బురుడింప గిరిమల్లికాదితరువల్లికాతల్లజంబులు పల్లవకుసుమశోభాసముల్లసితంబు లై సంపల్లలితు లగు గేస్తుల శోభనాయతనంబులం బోని నిజనికుంజంబుల కలిమి నెదిరిచూపుల కతిథిసత్కారంబు లాచరింప సముద్రయానంబు నిషిద్ధం బని యెఱింగియు వల్లభానుసరణంబునం గల మే లారసి రసోల్లసిత లగు స్రోతోవహాలు తటరుహమహీరుహవివిధవర్ణసుమగుళుచ్ఛప్రసాధనాంచిత లై వేతసకంటకితంబు లగు నెమ్మేను లుప్పొంగం బొంగారు తరంగరింగణంబులకుం బై పెచ్చు లగు జలపక్షుల వాశితంబులు నెచ్చెలుల యభినందనాలాపంబులుగా సమాశ్రితులకు శ్రీఫలసమృద్ధు లొసంగు నయ్యనుప్రన మొల్లం బై వెల్లివిరియు యశఃప్రవాహంబు నాఁ గొమరారు వెల్లువ పెల్లున ముజ్జగంబులు నాముకొని బ్రహ్మకూఁకటి ముట్టంజాలుదు మను సంరంభంబున విజృంభించి నాథుని సన్నిధి వడసి సకలసౌభాగ్యంబుల విలసిల్లఁ దఱి షరాబు మెరా బా లైన చోటు లెల్ల నాదుకొని మాదిరిసూపం బఱచి యుంచిన పచ్చికపట్టుల పచ్చలతోడి మేలికెంపు లనఁగు నారుద్రపురువుల నెమ్మేనులపైనిఁ దులకించు జిగి మెఱుంగులు కడలు గలయం బెరసి యయ్యదునునం బుడమి కన్నియ మెడనెడం బసరువన్నియ పొనరుపడు కెంబట్టుకొంబచ్చడంబు డంబు మీఱం దాల్చి కనుపట్టు వత్తెఱంగు రంగున నై రంగారు నొండుకారు నాఁచి కొనం బూచిన మోదుగుల కెంజాయ బెడంగులం దలపింపఁ గడంగఁ బ్రపంచం బెల్లఁ దానయై తమఃప్రధానప్రకృతి యావరించెనో పోషణకర్త యగు భార్గవీ భర్త నెమ్మేను సాఁచి యోగనిద్రాపరుం డై యుండం దదీయచ్ఛాయలు హరిదంతరంబుల వలముకొనియెనో భూతధాత్రి యెచ్చోటులనేనియుం దమాలవృక్షంబుల నావిర్భవింపఁ జేసెనో యెల్ల భూతంబులకు నేని నేవ తానకంబనై యుండియు

శూన్యపదం బను నప్రతిష్ఠం గాంచనేల యని తనలోఁ దా నెంచి యాకసంబు
నిజస్వరూపం బవధరించి యాక్రమించెనో నేఁడు మొదలుగా రేయుం బవలు నను
విభాగంబు జగంబునం జెల్లనేర దని సమయవిధి విధించిన శాసనంబుఁ బాక
శాసనుం డాచరణంబునం బెట్టెనో యనఁ జెలరేఁగి యెంతయుం బొసఁగించిన
యనంతమణిం గప్పిపెట్టి వారివాహంబు బలాకాపంక్తుల నెపఁ గపాలమాలికలం
దాల్చి యపరనీలకంఠుఁ డనఁ బొల్చి తదీయకంఠచ్ఛవియ యవిచ్ఛిన్న మై
నిజాకారస్ఫురణలం జెనుప భైరవారావంబులం బోని వజ్రనిర్ఘోషంబులం బరఁ
గింపుచు వింతపంచాననత్వంబున బ్రహ్మాండకర్పరంబుపేరి హస్తిమస్తకంబు విదా
రించు నద్దారిని జల్లుజల్లుమని రాలు క్రొత్తముత్తెంబులో దిక్కాంతలు మొగి
ళ్లనం జెల్లు జల్లెడ లెత్తి జల్లించినఁ జిల్లుల నుండి కొల్లలుగా డొల్లు తెల్లని మేలి
తండులంబులో యనం బొలుపారు జలధారల నుదారత్వంబునం గుఱియఁ దత్కాల
స్వర్ణకారుండు బయలుకమ్మిచ్చు బెజ్జములం గ్రొచ్చి కాఁడనం బట్టి తీవియం
దళతళలాడుచు వెలువడు మేలిపసిండితీఁగెలో యన దిక్కులకుం బ్రాఁకు క్రొమ్మె
ఱుంగులం దలిర్చు మెఱుంగుఁదీవియల సాహచర్యంబు స్వకీయప్రాభవంబునకు
మెఱుంగు వెట్టఁ దదేశాధిపత్యంబు ప్రవర్తిల్లు నయ్యెడ సర్వసర్వంసహాచక్రంబు
నూతనసస్యసంపత్సమృద్ధినిర్వక్రం బై వెలయఁ జాతకయాచనికుల దైన్యంబు
వాయఁ బరభృతౌఘంబులు నోళ్లు మూయఁ గురరీచయంబు లౌత్కంఠ్యంబున
మ్రోయ వర్షాభూమినివహంబులు స్తోత్రపాఠంబులఁ బొనరంజేయ నాలపోఁ
తులు అంకెలు వేయఁ బాంథులు నిజనివాసంబులం డాయ నమేయసుఖాస్పదం
బియ్యది యనం దనర్చు నయ్యవసరంబున. ౧౨

తే॥ సంగరం బెంచి యాసత్య ♦ సంగరుండు
ప్రియ వెతఁ దలంచి భూమిపు ♦ త్రీప్రియుండు
తమ్ముఁ గని హితనయుఁడుమ ♦ తమ్ము నెఱయఁ
బలికె రామవిభుం డిట్లు ♦ కులుకులాడి! ౧౩

సీ॥ ఇంత యొప్పునె వత్స!♦యిచ్చోటునం గుహా,యాయతాయోధ్యకు సాటి♦యనఁ దనర్చి
మూఁడు చాయల శిల♦ల్మానసి ప్రకాశింప, నిరుగెలంకుల నదు♦లింపుగూర్ప
జాజులు కడిమెలు♦సర్జకార్జునకురం, టకసింధువారాది♦సకలతరువు
లొద్దున విలసిల్ల♦నొడికమై యున్నది, యీసరోజిని కల్మి♦కిక్క యనఁగఁ
బ్రాగుదక్ప్రవణం బవా♦క్ప్రశ్చిమోన్న, తం బవాతప్రవేశ మీ♦తలము సమశి
లాముఖాఢ్యము ప్రాంచత్క♦లామనోజ్ఞ, మిట్టి నెలవున ననుభావ♦మేమి కలదొ.

తే॥ ఒప్పు నెన్నాంజనచయోప • మోచితంబు
కొండ యుత్తరమున నొకు • గూర్చు దక్షి-
ణమున గైలాసనిభ మొకం • డమలమూర్తి
వ్రీథితధాతువ్రకాశమ్ము • పర్వతమ్ము. ౧౫

క॥ శ్రీరమ్యమూర్తులే నను, లీలెండునను బ్రాక్ప్రవాహ•యిది యొప్పెడు భా
గీరథి త్రికూటమున న, ల్లార గుహాపూర్వలక్ష్మి•తాకృతి యగుచున్. ౧౬

ఆ॥ సకలతరులతోల్ల•సత్తీరపులినాఢ్య, చక్రవాకలక్ష్య•శకునరసిత
భృంగగీతిలలిత•ప్రియహంసగతియు నై, ననిచె నిదియు ననుచు•నాతివోలె. ౧౭

క॥ చందనసరళమహీజము, లిందు గలవు సిద్ధభూమి•యిది యిచట శతా
నందనిభులు మునివృషభు ల, మందతపశ్చరణయుక్తి•మలయుదు రెపుడున్. ౧౮

క॥ ఇవ్వానకారునందున, మవ్వ మెడలనీని విడిది•మ ట్టానఁగూడెన్
నెవ్వగలమాట కెమ్మెయి, నవ్వీధి విధిఁ దనదు తలఁపు•నం దిడినాడో. ౧౯

తే॥ గట్టు లెగచి యంతర మెల్లఁ • గ్రమ్మినట్టు
లాక్రమించెను మేఘంబు • లాకసంబుఁ
గంటె జలదాగమంబునఁ • గలిమిఁ గలఁడె
తాత యిఁకఁ బాంధులకు సుమి • తాత్రనూజ! ౨౦

తే॥ పసిఁడికొఅడాలఁ బోలు శం•పాలతికల, నంబుదాగమసంజ్ఞఁ డ•ట్లలతిమి కొట్ట
వ్యోమ మంత స్తనిత ఘోష•యుక్తిఁ జేసి, సవ్యధం బైన దన నయ్యె•సద్గుణాఢ్య! ౨౧

క॥ విద్యుత్పతాకికాది, ప్రద్యోతితమై న మేఘ •పటలి నెఱసె యు
ద్ధోద్యతహస్తిఘటాస్థితి, నుద్యద్గంభీరనిస్వ•నోచిత యగుచున్. ౨౨

తే॥ రవి సముద్రరసము నిజ • రశ్మిసమితిఁ
ద్రావి తాల్చిన గర్భమ్ము • ద్యోవధూటి
తాల్చెఁ దొమ్మిది నెల లిది • తఱియ కాఁగఁ
గనియెడు రసాయనమ్ము జ • గమ్ము మనుప. ౨౩

క॥ సురయువతిహారమౌక్తిక, వరములు రతిరాయిడి స్వ•భక్తములగుచున్
ధరఁ దొరఁగెడునో యన నం, బరతలమువనుండి పడెడు•బాధోధారల్. ౨౪

ఆ॥ అడఁగె ధూళి చల్ల•నయ్యెను గాలి వ్రి, శాంతిఁ గనె నిదాఘ•సంభవంబు
దోషచయము నిల్చె•దొరల యాత్ర ప్రవాసు, లరుగు దేరఁగాంచి•రిరవులకును.

వ్యాప్తపుష్ప బలాకిక ♦ యెలమి ఘనుని
గలసెఁ గాంతి సకామ యై ♦ కవియుఁ బ్రియుని. 34

ఉ। శైలికపుష్పగంధమున ♦ ఘ్రాణధృతిం బొనరించి దాన స
మ్యాళి మెసంగ సమ్మదన ♦ మన్విత మౌ మద మొప్పఁ గాలమే
ఘాతికృతిం దనర్చుచుఁ ద ♦ దారవము న్విని వ్యాప్త కేకి సం
ఘాతరవాతినృత్తములు ♦ గా ఘటియించెడు ఘీంకృతు ల్గనుల్. 35

తే। కదలి శైలవనోపమా ♦ ర్గమున వచ్చు
మదగజేంద్రమ్ము పరఁగు సం ♦ బుదరవంబు
విని ప్రతిభ టేభశంక నె ♦ క్కొను రయమున
నెదుమకొని సన్నివృత్త మ ♦ య్యెను కుమార! 36

తే। మేఘనిస్వనమును విని ♦ మేను లెగువ
నాచిరాక్రాంత యగు నిద్ర ♦ నపనయించి
యఱచుచున్నవి వారిధా ♦ రాభిహతిని
గోత్రతులు విభిన్నవర్ణస్వ ♦ రూపగతులు. 37

తే। అనువు నెడి యున్న దాతల ♦ నక్ష లట్టు
లంబుధారాభిహతము లౌ ♦ నబ్జములను
విడిచిపెట్టి సకేసర ♦ వికచనీప
పుష్పవనముల పై వ్రాలి ♦ పొసఁగెఁ దేంట్లు. 38

తే। అధ్యయన మొనరించెడు ♦ నవనిధరము
లబ్దకృష్ణాజినధరము ♦ లమలసలిల
వర్షధారోపవీతము ♦ ల్వాయుపూర్ణ
కందరమ్ములు నై యవె ♦ కను మభిజ్ఞ ! 39

క। జలధారాఘాతంబు ల, చలములు నఘలామ్రములు ల♦నర్ఝరములు నై
విలసిల్లె స్వర్ణముక్తా, కలాపముల నొప్పు భూమి♦కాంతుల పోలెన్. 40

సీ। గైరికాదికధాతు♦కలిత మై నవజలం బనురాగసంపద♦ననువదింపఁ
గడిమెప్పుపువ్వులు పర్జ♦కపరిసూనంబులు, శోభనాలంకృతి♦చొప్పు నొడువఁ
జక్రవాకాదిపక్షి♦సక్తత యవయవ, సంస్థానసామగ్రి♦చక్కి నెగడ
బర్హికేకారవ♦ప్రస్తావమున బంధు, లామంత్రణము సేయు♦టనుపపడఁగఁ

